# ఆధునిక సాహిత్యం : దళిత స్పృహ

యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ

**1-8-1993** నాటి 'సమాలోచనమ్' లో
సమర్పించిన ఉపన్యాస వ్యాస మంజరి



**యువభారతి**
**సాహితీ సాంస్కృతిక సంస్థ**
**ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు**
**తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001.**

**Adhunika Sahityam : Dalita Spriha**

Literary essays presented in 'Samalochanam' on 1.8.1993

Published by YUVA BHARATHI, literary and cultural organisation, Tilak Road, Hyderabad - 500 001.



యువభారతి 30 వ వార్షికోత్సవ ప్రచురణ

ప్రచురణ సంఖ్య : 151

ప్రథమ ముద్రణ : మార్చి, 1994

ప్రతులు : 1000

ముఖచిత్రాలంకరణ : శ్రీ శీలా వీర్రాజు

**వెల : రూ. 10.00**

ప్రతులకు :

**యువ భారతి కార్యాలయం**

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,

తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001

ముద్రణ :

**పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్,**

1.1.517/B/1, న్యూ బాకారం,

గాంధీనగర్, హైదరాబాదు - 500 380

ఫోన్లు : 611413, 600457

ముఖచిత్ర ముద్రణ :

**విప్లా ప్రింటర్స్ ప్రైవేట్ లిమిటెడ్,**

శంకరమఠం దగ్గర, నల్లకుంట,

హైదరాబాదు - 500 044.

ఫోన్ : 666242.



# మూడు పదుల యువభారతి

## మూడు ఆశయాలు :

సమాజ శ్రేయస్సుకు సమున్నత ప్రమాణాలు గల సాహిత్యం, ఉత్తమ మూల్యాలను పెంచి పోషించ గల సహృదయ లోకం అవసరమని గుర్తించి, ఆ రెండింటినీ బలంగా పెంపొందించే సాహిత్య సాంస్కృతిక సామాజిక చైతన్యాన్ని కలిగించటానికి యువభారతి ఉద్యమిస్తున్నది.

సాహిత్యం ఎటువంటి సాహిత్యేతర శక్తుల అజమాయిషీకి లోనుగాకుండా, స్వతంత్ర వ్యక్తిత్వంతో సాత్త్విక శక్తిగా రూపొందాలనీ, అటువంటి సాహిత్యాన్ని సృష్టించే రచయితలు ఏ కాలం వారైనా, వారి కృషినీ, సందేశాన్నీ సామాన్య ప్రజానీకానికి అందేటట్లు వివిధ ప్రచురణలద్వారా, కార్యక్రమాల ద్వారా యువ భారతి యత్నిస్తోంది. అంటే - రాజకీయ కాలుష్యం లేని సాహిత్యోద్యమాన్ని యువభారతి అవిశ్రాంతంగా సాగిస్తోంది!

'చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించటం మంచిది' - అనే లక్ష్యంతో సమాజంలో వ్యష్టిగా, సమష్టిగా శాంతియుత సహజీవనాన్నీ, ప్రజా స్వామ్య విధానాన్నీ, నిర్మాణాత్మక కార్యశీలాన్నీ, మానవత్వపు విలువలతో కూడిన సేవాభావాన్నీ ఆచరించి చూపిస్తోంది యువభారతి!

## సాహితీసంస్థగా ముందడుగు :

రాజకీయాల స్వార్థకాలుష్యాలకు అతీతంగా ఉండగలిగే విశ్వజనీనమైన సాహిత్య స్పృహను సమాజంలో జాగృతం చేసి, తెలుగు సాహిత్యాభిమానాన్ని ఇంటింటా జ్యోతిలా వెలిగించాలనే ప్రయత్నంతో యువభారతి ముప్పైయేళ్ళుగా ఉద్యమాన్ని సాగిస్తోంది. సమాజంలో ఉత్తమ సాహిత్యం పుట్టటం ఒక వంతు; దానిని ప్రజల మధ్యకు తీసుకొనిపోయే ప్రయత్నం మరొక వంతు. పొలం దున్నే రైతులు, రాట్నం తిప్పే పల్లెటూరి పడతులు, మధ్యతరగతి ప్రజలు, యువతీ యువకులు, విద్యార్థినీ విద్యార్థులు, ఫ్యాక్టరీ కూలీలు, ఉద్యోగులు, ఉద్యోగినులు - ఇలా చదువుకున్న ప్రతివారూ తెలుగు సాహిత్యంలో వెలువడిన

అంటే వారి మాతృభాషలో వెలువడిన - సాహిత్యం చదవాలి. లేదా, కనీసం ఆ సాహిత్యం గురించి పరిచయం చేసుకోవాలి. అప్పుడే తెలుగుసాహితి సమాజంలో సజీవంగా ప్రవహించటానికి వీలుంటుంది. ఒక జాతిలో రచయిత(త్రు)లు పుట్టటం ఎంత గొప్పో, సహృదయులు అధికశాతంలో అభివృద్ధి చెందటం కూడా అంతే గొప్ప. సాహిత్యంలోని ఉత్తమ విలువలను గుర్తించి, గౌరవించే సహృదయ లోకాన్ని సాహితీ వాతావరణాన్ని సమాజంలో నిర్మించటంలో సాహితీ సాంస్కృతిక సంస్థల పాత్ర విశేషంగా ఉంది. ఆ బాధ్యతను గుర్తించి యువభారతి ఇన్నాళ్ళుగా సాహిత్యోద్యమాన్ని సాగిస్తున్నది. ప్రజల హృదయాలలో తన ముద్రను పదిలంగా వేసుకున్నది.

## యువభారతి జీవితం ఒక సాహిత్యోద్యమం :

యువభారతి 1963 సం॥ విజయదశమినాడు పుట్టింది. మొదటి రెండేళ్లూ రూపుదిద్దుకున్నది. ప్రతి నెలా మొదటి, మూడవ ఆదివారాలలో సమావేశమై యువభారతీయులు మూడుగంటలసేపు మానవ సమగ్ర వ్యక్తిత్వ నిర్మాణానికి తోడ్పడే కార్యక్రమాలను నిర్వహించుకునేవారు. వక్తృత్వాన్ని, రచనా పాటవాన్ని, ఆలోచనాశక్తిని, అధ్యయన శీలాన్ని, ఋడితిస్ఫూర్తిని అలవరచే క్లుప్త గోష్ఠి, పుస్తకచర్చ, కవితాపఠనం, సమాలోచనం మొదలైన అంశాలను చైతన్యవంతంగా నిర్వహించుకునేవారు. అప్పటి సమావేశాలన్నీ సాహితీ శిక్షణ శిబిరాలుగా ఉండేవి. 1965 విజయదశమి నాటికి యువభారతి ఒక సమగ్ర రూపం తాల్చింది.

1965-70 సంవత్సరాల మధ్య యువభారతి తన ఆశయాలకు అనుగుణంగా సాహిత్య కార్యక్రమాలను చేపట్టి ప్రజల మధ్యకు నడిచింది. బలమైన ప్రయోగాలను చిత్తశుద్ధితో చేసి ప్రజల మన్ననలను పొందటం ప్రారంభించింది. మహిళా విభాగ కార్యక్రమాల ప్రారంభం, సైక్లోస్టైల్డు పత్రిక వెలువరించటం (దాదాపు వెయ్యి ప్రతులు చెల్లేవి) ముఖ్యమైన అంశాలు. యువభారతి ప్రచురణలు, సదస్సులు ఒక ప్రత్యేకతతో తెలుగువారిని ఆకర్షించటం ఆరంభించాయి. అనుముల కృష్ణమూర్తిగారి 'సరస్వతీ సాక్షాత్కారం', కాళోజీగారి 'జీవనగీత', యువభారతీయుల కవితా సంకలనం 'వీచికలు' తక్కువ ధరకు ప్రచురణ పూర్వ విరాళ పద్ధతిలో వెలువరించిన తొలిప్రచురణలు. 1970 లో 'మారుతున్న విలువలు: రచయితల బాధ్యతలు' అనే అంశం మీద నిర్వహించిన గోష్ఠి,

దానిని 'రచన'గా ప్రచురించిన అనుభవం యువభారతికి కీర్తిప్రతిష్ఠలతోపాటు ఒక ప్రామాణికమైన సాహిత్య సంస్థకు వచ్చే గుర్తింపును గూడా తెచ్చిపెట్టాయి.

**1971 - 1985** మధ్య యువభారతి సమాజంలో ఒక అపూర్వ సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. యువభారతి వార్షికోత్సవాల 'లహరి ఉపన్యాస పరంపరలు' ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారిచ్చిన 'కావ్యలహరి' తో మొదలయ్యాయి. **1971** లో వేలమంది సాహితీ సభలకు రావటం, సాహిత్యపు విలువలపట్ల సదవగాహన సమాజంలో ఏర్పడటం యువభారతి సాహిత్యోద్యమం కలిగించిన విలువైన చైతన్యం. కావ్యలహరి, కవితాలహరి, చైతన్యలహరి, వికాసలహరి, రామాయణలహరి, నవోదయలహరి, నవ్యసాహితీలహరి, ప్రతిభా లహరి, ఆలోచనాలహరి, సంస్కృత సాహిత్యలహరి, జగద్గురు సాహితీలహరి మొదలైన 'లహరి' ప్రచురణలు సాహితీలోకంలో మన్ననల నందుకున్నాయి.

భారత స్వాతంత్ర్య రజతోత్సవాలను పురస్కరించుకొని యువభారతి ప్రచురించిన నూరు వ్యాసాల 'మహతి' తెలుగు సాహితీ పరులలో ఒక విలువైన గౌరవాన్ని పొందింది; పరిశోధకుల మన్ననల నందుకున్నది. తెలుగు నవలలను గురించి ఇంగ్లీషులో చెప్పటానికి ప్రయత్నించిన **Telugu Novel** మంచి ప్రయోగంగా ఆదరణ పొందింది. తెలుగులో కవుల కవితా వైభవాలను ప్రచురించే యువభారతి రచనలు ప్రాచీనాధునికాంధ్ర కవులను, భారతీయ భాషా కవులను సరళంగా వ్యాఖ్యానించి చెప్పాయి; చెపుతున్నాయి. యువభారతి ప్రచురించే ప్రతి ప్రచురణా ఆయా సమయాల్లో సమాజంలో కలిగించవలసిన సాహితీ స్పృహను దృష్టిలో ఉంచుకొని రూపొందించేదే. కాలగతిలో అవిచ్ఛిన్నంగా సాగవలసిన సాహితీ రసికత్వాన్ని లహరిగా ప్రవహించేటట్లు కార్యక్రమాలను సాగించటం యువభారతి ప్రవృత్తి!

**1991 - 1992** లో యువభారతి రజతోత్సవాలను జరుపుకున్నది. పద్మభూషణ్ ఆచార్య సి. నారాయణరెడ్డిగారు 'తెలుగు కవిత : లయాత్మకత' అనే అంశం మీద రజతోత్సవ ఉపన్యాస లహరిని అందించారు. అది గ్రంథరూపంగా వెలువడింది. నెలనెలా మొదటి ఆదివారం సాయంకాలం 5.30 గం॥లకు జరిగే "సమాలోచనం" సమావేశాలన్నీ రజతోత్సవాలలో భాగాలుగా మలచబడ్డాయి. 'ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం' (1980 - 1990), 'పాతికేళ్ళ పత్రికా రచన' (1965-1990), యువభారతి రజతోత్సవ సంచిక 'వెండి వెలుగులు',

'అనుభూతి', 'అమృత రాజీవం' కవితా సంపుటాలు రజతోత్సవ ప్రచురణలుగా వచ్చాయి. రజతోత్సవాలలో భాగంగా జరిగిన సదస్సులలోని ఉపన్యాసవ్యాసాల సంకలనాలను 30వ వార్షికోత్సవాల ప్రచురణలుగా వెలువరించటం జరుగుతున్నది. ఆలోచనలకు అక్షరాకృతి నివ్వటం యువభారతి సాహితీవ్రతం.

ప్రతి నెలా మొదటి ఆదివారం జరిగే 'సమాలోచనమ్'లో 1992, 1993 సంవత్సరాల సాహిత్య సమీక్ష కార్యక్రమాలు నిర్వహించాం. ప్రతి యేటా ఆ సంవత్సరంలో వచ్చిన సాహిత్యాంశాల సూచిని, సమీక్షను ప్రచురించాలని యువభారతి ప్రయత్నం. ఆ దిశగా సాగే యాత్రలో ఇదొక మొదటి మజిలీగా సాహితీ సమాలోచనం 1992-93 ప్రచురింపబడింది.

నేటి తెలుగు సాహిత్యంలో అత్యంత నవ్యభావ ధోరణులుగా వెలువడుతున్న స్త్రీవాదం, దళితవాదం సాహితీపరుల, రచయితల దృష్టిని బాగా ఆకర్షిస్తున్నాయి. పత్రికలలో ఆ ప్రవృత్తులమీద వ్యాసాలు విరివిగా వెలువడుతున్నాయి. ఆ అంశాలపై సరళంగా సహృదయలోకానికి పరిచయం చేయాలని యువభారతి తన సమాలోచన కార్యక్రమంలో భాగంగా 1993 ఆగస్టు 1వ తేదీన ఒక గోష్ఠిని ఏర్పాటు చేసింది. దానిలో పాల్గొన్న ప్రముఖుల ప్రసంగ వ్యాసాలను ఈ ప్రచురణగా వెలువరిస్తున్నది.

ఈ గ్రంథంలో తమ అమూల్యమైన రచనలు అందించి సహకరించిన ఆచార్య కె.కె. రంగనాథాచార్యులుగారికి, డాక్టర్ ఎస్వీ సత్యనారాయణగారికి, శ్రీ కె. శ్రీనివాస్‌గారికి యువభారతి కృతజ్ఞతాభివందనాల నర్పిస్తున్నది.

యువభారతిని ప్రోత్సహిస్తున్న 'సాహితీ మిత్రుల'కు, 'భారతీ మిత్రుల'కు 'భారతీ భూషణు'లకు, ప్రకటనదారులకు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్‌కు, విప్లా ప్రింటర్స్‌కు మా ధన్యవాదాలు.

వార్షికోత్సవ సభలను స్పాన్సర్ చేసి, ప్రకటనల నిచ్చి యువభారతికి చేయూతనిచ్చిన చిన్న మొత్తాల పొదుపు సంస్థ కమీషనరు డా॥ జె. బాపురెడ్డిగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు!

యువభారతి నభిమానించే సాహితీలోకానికి మా అభివందన చందనాలు!

హైదరాబాదు,
6-3-1994.

జి. వి. సుబ్రహ్మణ్యం
అధ్యక్షుడు.

# విషయసూచిక



# ఆంధ్ర జనతకు, నవతకు
# యువతకు అంకితమ్ము

చిమ్మ చీకట్లను చీదరించుట కంటె
　　　చిరుదివ్వె వెలిగించు శిల్ప మెరిగి
సామాన్య జనులలో సాహిత్య చైతన్య
　　　సందీప్తి పోషించు సతులు తీర్చి
కమనీయ కావ్యాల కవితా కళా శిల్ప
　　　వైభవాల్ వివరించు ప్రభలు చిమ్మి
మానవ మూల్యాల మహనీయ సంస్కృతి
　　　నిర్మాణ శిక్షణ నీతి నెరపి

భారతీపాద మంజీర భవ్యరవము
తెలుగు వారల గుండెలో వెలుగునట్లు
చెలగు యువభారతీ సంస్థ జీవితమ్ము
ఆంధ్రజనతకు నవతకు అంకితమ్ము!
ఆంధ్ర జనతకు యువతకు అంకితమ్ము!!

—డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం

# తెలుగుసాహిత్యంలో దళితచైతన్యం

—ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు

1960ల నుండి భారతీయసాహిత్యాలలో దళిత చైతన్యం దళిత సాహిత్యం అన్న పద బంధాలు ప్రముఖంగా వినిపిస్తున్నాయి. 1970 లలో మరాఠీ, కన్నడ భాషలలో నిర్దిష్టలక్ష్యాలతో, ప్రత్యేకమైన అభివ్యక్తులతో దళిత సాహిత్యం పురోగమించింది. 1980 ల ఉత్తరార్థంలో తెలుగు సాహిత్యంలో దళిత చైతన్యం నిర్దిష్ట రూపాన్నిపొంది, 1890 లు మొదలయ్యే నాటికి దళిత సాహిత్యం సాహిత్యంగా నిలదొక్కుకునే ప్రయత్నం చేస్తూఉంది. తెలుగు సాహిత్యంలో దళిత స్పృహకు కొన్ని శతాబ్దాల చరిత్ర, పరిణామక్రమం ఉంది. దళిత చైతన్యం తెలుగు సాహిత్యంలో కొన్ని కొత్త ప్రశ్నలను లేవనెత్తుతూ ఉంది. దశాబ్దం కాలంగా ఆధునిక సాహిత్యంతోసహా తెలుగు సాహిత్యానికి గల పరిధుల్నీ, పరిమితుల్నీ, ప్రయోజనాలను ప్రశ్నించడం ప్రారంభం అయింది. ప్రగతిశీల సాహిత్య లోకం మొదలుకొని సంప్రదాయ సాహిత్య లోకం వరకు అందరూ దళిత చైతన్యానికి ఒకే రకంగా ప్రతిస్పందించడం చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఈ స్పందనలు అన్నింటిలో కనిపించే సమాన లక్షణం- దళిత సాహిత్యాన్ని వేర్పాటువాద సాహిత్యంగా, కులతత్వ సాహిత్యంగా పరిగణించడం. వర్ణవ్యవస్థను ఆదర్శీకరించిన సంప్రదాయ సాహిత్యం వేరులుపెట్టే సాహిత్యం కదా! ఆధునిక సాహిత్యం, చాలావరకూ ఉన్నత వర్గ దృక్పథానికి ప్రాతినిధ్యం వహించే సాహిత్యమే కదా! అన్న ప్రశ్నలకు సమాధానాలు వీరిదగ్గరనుంచి రావు.

## దళిత సాహిత్యం : ప్రాథమిక అవగాహన :

దళిత సాహిత్యాన్ని గురించి చర్చించేటప్పుడు సాహిత్యానికి సంబంధించిన విలువల విషయంలో, సాహిత్య స్వరూప, స్వభావ, ప్రయోజనాల విషయంలో ఒక ప్రాథమికమైన అవగాహన అవసరం. ఈ అంశాన్ని మొదట పరిశీలిద్దాం.

1. దళిత సాహిత్యాన్నే కాదు, ఆ మాటకు వస్తే మొత్తం ఆధునిక సాహిత్యాన్ని సమాజం, రాజకీయాలు, చరిత్ర వీటి నుంచి వేరు చేసి చర్చించడం, వివేచించడం, విమర్శించడం, అంచనా వేయడం ఒట్టి మాటలను మూట కట్టడమే అవుతుంది. సాహిత్యాన్ని చైతన్యంతో సంబంధంలేని, సారంలేని మాటల కూర్పుగా చూడడమే సాహిత్య విమర్శగా మిగులుతుంది. సాహిత్య స్వయం ప్రతిపత్తివాదులుగా సంప్రదాయ సాహిత్య విమర్శకులుగాని, శైలీ శాస్త్రం మీదనే ఆధారపడ్డ ఆధునిక కేవల రూపవాద విమర్శకులుగాని చేస్తున్న పని అదే. సాహిత్య చరిత్రలో పునరుజ్జీవనం, సంస్కరణ, హేతువాదం, అభ్యుదయం, విప్లవం మొదలైన భావనలను, చివరకు అనుభూతి అన్న భావనను కూడా చరిత్రతో, సమాజంతో, సమాజంలో మనిషి అస్తిత్వంతో సంబంధం లేకుండా వివరించలేకపోవడం, నిర్వచించడానికి సాధ్యం కాకపోవడం సాహిత్యానికి సామాజిక పరిణామంతో ఉన్న అవినాభావ సంబంధాన్ని నిరూపిస్తుంది.

ఆధునిక కాలంలో సంప్రదాయ చైతన్యంతో, సంప్రదాయ రూపాలలో సాహిత్య సృష్టి చేయడానికి కూడా సమాజమే భూమిక. మారుతున్న సమాజంలో తన/తమ అస్తిత్వానికి ముప్పు ఏర్పడుతున్నదన్న భయం, కాళ్ళకింద నేల తొలుచుకొనిపోయే అనుభవం, తన/తమ స్థానం ఏ వ్యవస్థలో సురక్షితంగా ఉంటుందని భావిస్తున్నాడో/రో ఆ వ్యవస్థ కొనసాగడాన్ని, నిలబడడాన్ని ఆకాంక్షించడం నడుస్తున్న చరిత్రకు స్పందనేకాని చరిత్రకు అతీతమూ, చరిత్ర నుంచి విముక్తమూ అయిన అభివ్యక్తి మాత్రం కాదు. అది చరిత్రకు అధీనమైన ఒక మానసికస్థితి. సాహిత్య రూపంలో తాను కోరుకొంటున్న సమాజాన్ని గురించి చెప్పడం తప్ప అది మరొకటికాదు. అలాంటి రచయితలను వారు కోరుకుంటున్న సమాజం, నీతి, ధర్మం, విలువలు మొదలైనవాటిని స్పృశించకుండా విమర్శించడం సాధ్యమా? అసలు విమర్శించడం జరుగుతున్నదా? తమ భావాలను, అస్తిత్వానికి భంగకరమైన సాహిత్యాన్ని గురించి చర్చించే సందర్భంలో మాత్రమే కేవల సాహిత్యం, శుద్ధ సాహిత్యం, సాహిత్య స్వయం ప్రతిపత్తి అన్న సిద్ధాంతాలు ముందుకు వస్తాయి.

2. వ్యక్తి, వ్యక్తి చైతన్యం, వైయక్తికమైన అనుభూతులు - వీటిని మాత్రమే ఆధునిక చైతన్యంగా భావించే ఆధునికులకు కూడా దళిత సాహిత్యం

సాహిత్యంగా కనిపించదు. ఎంత మార్మికంగా చెప్తే అంత గొప్ప సాహిత్యం అవుతుంది వాళ్ళకి. దళిత సాహిత్యానిది సామూహిక స్పృహ, సామాజిక స్పృహ. సాహిత్య వస్తువు, సాహిత్య భాష ప్రత్యేకమూ, అసాధారణమూ, విశిష్టమూ అన్న భావన ఇక్కడ ఎక్కువగా పని చేయదు. దళితుల అనుభవాలు సామాన్య అనుభావాలు, సామూహిక అనుభవాలు. వాటిని అభివ్యక్తం చేసే భాష కూడా అంతే సామాన్యంగా ఉంటుంది. అనుభవాలు అమూర్త అనుభూతులుగా పర్యవసించే అవకాశం ఇక్కడ లేదు. అందువల్ల మార్మికతకు అసలు ఆవకాశం లేదు. అనుభూతి అనే అమూర్త వస్తువుకు భావ చిత్రాలను అలంకరించి, ప్రతిమల మాలికలను అల్లి, బుద్ధిని మిరిమిట్లుగొలిపేవారికి దళిత సాహిత్యం సాహిత్యంగా కనిపించకపోవడం చాలా సహజం.

3. మరో అంశం దళిత సాహిత్యాన్ని ప్రచార సాహిత్యంగా కొట్టి పారేయడం. తెలుగు సాహిత్యం ప్రారంభం నుంచే ప్రచార సాహిత్యం బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను స్వచారిత్రం తప్పకుండా కాపాడటం రాజధర్మం అని ప్రచారం చేసిన నన్నయ భారతం మొదలుకొని, వీర శైవ సాహిత్యం, అరుణాస్పద నగరంలోని చతుర్వర్ణాల వారిని, ప్రవరుడి గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణను కాల్పనిక రీతిలో పైకెత్తిన పెద్దన మనుచరిత్ర వరకు తెలుగు సాహిత్యం ప్రధానంగా ప్రచార సాహిత్యంగానే కనిపిస్తుంది. సంస్కరణ వాద దశనుంచి ఆధునిక తెలుగు సాహిత్యాన్ని గురించి వేరే చెప్ప నవసరం లేదు. ప్రశ్న ఫలానా సాహిత్యం ప్రచార సాహిత్యమా- కాదా? అన్నది కాదు. ఏం ప్రచారం చేస్తున్నది అన్నది అసలు ప్రశ్న. అలాగే సంప్రదాయ సాహిత్య సిద్ధాంతాలు గాని, ఒక దశకు చెందిన ఆధునిక సాహిత్య సిద్ధాంతాలు గాని దళిత సాహిత్యాన్ని అంచనా కట్టడానికి పనికిరాకపోవచ్చు. ప్రతి సాహిత్యం తన సాహిత్య సిద్ధాంతాలను తానే నిర్మించుకుంటుంది.

## దళితులంటే...

దళిత సాహిత్యం, దళిత చైతన్యం అనగానే రకరకాల ప్రశ్నలు వస్తాయి. దళిత అన్న పదం ఆత్మన్యూనతను సూచించేదిగా కొందరు భావిస్తారు. అంతకు ముందు అస్పృశ్యులు అన్నమాట ప్రచారంలో ఉండేది. కులాన్ని సూచించే

మాల, వర్ణ వ్యవస్థలో స్థానాన్ని సూచించే పంచముడు మొదటినుంచి వాడుకలో ఉన్న పదాలు. జాతీయోద్యమంతోపాటు వచ్చిన అస్పృశ్యతా నివారణోద్యమంలో భాగంగా గాంధీతో అస్పృశ్యులకు హరిజనులనే పేరు ప్రచారంలోకి వచ్చింది. అస్పృశ్యత సామాజికమైన అంశం. మత స్పృహలో భాగంగా హరిజనులనే పేరు వచ్చింది. మారిన రాజకీయ, సామాజిక పరిస్థితులలో "హరిజన' అన్న పదాన్ని వాడటానికి చాలామంది హరిజనులే ఇష్టపడటం లేదు. ఒకప్పుడు దళిత అన్న పదం హైన్యాన్ని, దైన్యాన్ని, దారిద్ర్యాన్ని మాత్రమే సూచించే పదం కావచ్చు. ప్రస్తుత సందర్భంలో దాని అర్థం మారింది. ప్రస్తుతం అది కొన్ని కులాలను సూచించే పదంగా మాత్రమే విస్తృతార్థంలో వాడుకలో ఉంది. దళిత అన్న పదం బలహీనతను, అసహాయతను, వైఫల్యాన్ని సూచించదు. అది ఒక సంఘటిత శక్తికి ప్రతీక. ఆత్మవిశ్వాసానికి, ధైర్యానికి ఆలంబనం. "తరతరాలుగా అస్పృశ్యతకు గురై, మతం పేరిట సాంస్కృతికంగా హీనంగా చూడబడి, విద్యాసౌకర్యాలు కరువై, సమాజంలో ఉంటూ కూడా ప్రధాన జీవన స్రవంతికి దూరమై, ఆర్థికమైన అణచివేతకు, శ్రమదోపిడీకి గురిఅయినవాళ్ళు'' అన్న అర్థంలో దళిత అన్న పదాన్ని ప్రస్తుతం ఉపయోగించవచ్చు.

మరాఠీలో దళిత సాహిత్యానికి జ్యోతి బాపూలే- అంతకంటే ఎక్కువగా డా॥ భీమ్‌రావ్ బాబాసాహెబ్ అంబేద్కర్ ప్రేరణ నిచ్చారు. 1950 లలో ప్రారంభమై- మహారాష్ట్ర బుద్ధసాహిత్య పరిషత్తు దోహదంతో విస్తరించిన దళిత సాహిత్యం 1970 లలో స్థిరమైన ఉద్యమ రూపాన్ని పొంది, 1980 ల నాటికి మరాఠీ సాహిత్య స్రవంతిలో భాగమై గుర్తింపుపొంది పాఠ్యగ్రంథాలలోకి కూడా ప్రవేశించింది. బాబూరావు బగుల్, నారాయణ్ సుర్వే, అర్జున్ కాంబ్లే, దయా పవార్, వామన్ నింబాల్కర్, నామ్‌దేవ్ ఢాశాల్ మొదలైన రచయితలు మరాఠీ దళిత సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు. నాటకాలు తప్ప సుమారు తక్కిన అన్ని సాహిత్య ప్రక్రియలలోను దళిత సాహిత్యం వచ్చింది. దళిత సాహిత్యాన్ని యూరప్, ఆఫ్రికా, అమెరికాలలో బ్లాక్‌లిటరేచర్‌తో పోలుస్తూవుంటారు. కన్నడంలో కూడా దళిత సాహిత్యం ఒక బలమైన ఉద్యమంగా కనిపిస్తుంది. ఏ భాషలోనైనా దళిత సాహిత్యం పైన అంబేద్కర్ ప్రభావం ప్రత్యక్షంగా కనిపిస్తుంది.

## దళితచైతన్యం - పరిణామక్రమం :

ఇటీవలి కాలం వరకు తెలుగు సాహిత్యంలో దళిత చైతన్యం ఒక ప్రత్యేకమైన పాయగా కనిపించదు. బలమైన సామాజిక, రాజకీయోద్యమాలు బలంగా ఉండడం, ఇతర సమస్యలతోపాటు దళిత సమస్యలుకూడా అందులో భాగం కావడం దీనికి కారణం కావచ్చు. వేమన, తత్త్వకవులు మానవతా వాద దృష్టితోను, గురజాడ హేతువాద దృష్టితోను పంచముల సమస్యలను పరిశీలించారు. సంఘ సంస్కరణోద్యమాలు ప్రధానంగా స్త్రీ సమస్యలపైనే కేంద్రీకరించినా కొంతవరకు కుల సమస్యను కూడా గుర్తించాయి. జాతీయోద్యమం అస్పృశ్యత సమస్యను ప్రధానంగా గుర్తించి, మత స్పృహతో దాన్ని పరిష్కరించే ప్రయత్నం చేసింది.

అభ్యుదయ సాహిత్యోద్యమం పీడిత/శ్రామికవర్గ సమస్యలలో భాగంగా దళిత సమస్యల పరిష్కారాన్ని సూచించింది. ఆర్థిక సంస్కరణలకి అది ఎక్కువ ప్రధానాన్ని ఇచ్చింది. విప్లవ సాహిత్యోద్యమంతో గిరిజన సమస్యలతో పాటు హరిజన సమస్యలకు కూడా ప్రత్యేక ప్రాధాన్యం గుర్తింపు వచ్చింది. అంతకుముందు ప్రగతిశీల ఉద్యమాలన్నిటికంటే కూడా దళితులను ఎక్కువగా ఆకర్షించింది విప్లవోద్యమం.

స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చిన ఉద్యమాలు దళితులలో కొన్ని ఆశలను కల్పించాయి. ఆధునికీకరణ, విద్య, నగర వాతావరణం, ఉద్యోగాలు, సైద్ధాంతికంగా సామాజిక సమానత్వం అన్న భావన, రాజకీయ, ఆర్థిక రంగాలలో మార్పులు తరతమ భేదాలను పోగొడ్తాయని, తాము ప్రధాన జీవనస్రవంతిలో భాగం అవుతామని భవిష్యత్తుపైన ఆశను పెంచుకున్న ఈ వర్గం స్వాతంత్ర్యం తరువాత నిరాశను పొందింది. స్వాతంత్ర్యానికిముందు తొలిదశలో విద్యావంతులై రాజకీయాలతోను, సమాజంలోను అంతో, ఇంతో స్థానం పొందిన దళితులు సంస్కృతీకరణం / బ్రాహ్మణీకరణం పొంది తమ పునాదిని విస్మరించారు. యువ దళిత తరం ఈ వర్గాన్ని కూడా ఎదుర్కోవలసి వచ్చింది. స్వాతంత్ర్యానంతరం ప్రకటించిన రాయితీలు దళితులను ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక రంగాలలో అధికారం గల వర్గంపైన ఆధారపడేవారినిగా చేశాయి. అవి మానసికంగా వారి ఆత్మస్థైర్యాన్ని పెంచటానికి కవి దోహదం చేయలేదు. రాయితీల

దశ దాటి స్వతంత్రమైన అస్తిత్వం కోసం ఆలోచించే దళితులు విప్లవోద్యమం వైపు మొగ్గుచూపారు. విప్లవ సాహిత్యోద్యమంతోపాటు కవులుగా పుట్టి, ఎదిగిన వారు చాలామంది దళితవర్గానికి చెందినవారే.

విప్లవ సాహిత్యోద్యమం సాధారణ జన జీవితంలో ముందుకు తెచ్చిన ఎజెండాలో పౌర హక్కులు, మానవ హక్కులు ప్రధానమైనవి. అవిశ్రాంత పోరాటంతోనే ఆత్మగౌరవం, నిజమైన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలు సాధ్యం అన్న చైతన్యాన్ని ముందుకు తెచ్చింది. దీనిలో ఓటు బ్యాంకుగా ఉపయోగపడే దశను దళితవర్గం దాటింది. వర్ణ వ్యవస్థకు లెజిటమసీని, తర్కసంగతిని, ఔచిత్యాన్ని కల్పించే సాహిత్యం, విమర్శ పునరుద్ధృతం కావడానికి దారితీసిన పరిస్థితుల్ని ఎదుర్కోవడంలో భాగంగా దళిత చైతన్యం నిలదొక్కుకుంటున్నది. ఇస్తే పుచ్చుకునే దశనుంచి, ఎవరో ఉద్ధరించడం అన్న భావన నుంచి తమ హక్కుని గుర్తించే దిశగా దళిత చైతన్యం పురోగమిస్తున్నది. ఆర్థిక కోణానికి అధిక ప్రాధాన్యం ఇచ్చే విప్లవ స్పృహతో సమాంతరంగా సామాజిక, సాంస్కృతిక రంగాలలో కూడా దళిత చైతన్యం విస్తరిస్తున్నది. భారతదేశానికి సంబంధించి నంతవరకు కులం, వర్గం - ఈ రెండిటిని ఏంతవరకు విడిగా చూడగలం అన్న చర్చను కూడా దళిత చైతన్యం ముందుకు తీసుకొని వచ్చింది.

## తెలుగు దళితసాహిత్య పరిణామక్రమం:

తెలుగు సమాజంలో సాహిత్యంలో దళిత స్పృహ ఒక బలమైన చైతన్యంగా నిలబడటానికి కొన్ని శతాబ్దాల చరిత్ర ఉంది. జీవితానుభవం నుంచి పొందిన స్పందన[1], నిరసన[2], సంస్కరణ[3], ఉద్ధరణ[4], విమర్శ[5], విజ్ఞాపన[6], సంఘటన[7], ప్రతిఘటన[8] అన్న దశలు దళిత చైతన్య పరిణామక్రమంలో కనిపిస్తాయి. సమాజంలోకాని, సాహిత్యంలోకాని ఏ చైతన్యమూ హఠాత్తుగా రాదు. అణచి ఉన్న స్పృహను, నివురుగప్పిన నిప్పులా ఉన్న చైతన్యాన్ని కొన్ని సంఘటనలు ఉద్బుద్ధం చేస్తాయి. 1968 లో కృష్ణాజిల్లా కంచికచర్లలో చిన్న దొంగతనం చేశాడనే కారణంతో కోటేశు అన్న దళితుణ్ణి కట్టేసి కాల్చడం మొదలుకొని పదిరికుప్పం, కారంచేడు, చుండూరు మొదలైనచోట్ల దళితులపైన జరిగిన దౌర్జన్యాలు దళితులు మరింత సంఘటితం కావడానికి ఉద్బోధకాలయ్యాయి. ఈ సందర్భంగా ఎంతో సాహిత్యం వచ్చింది. మండల్ కమిషన్ నివేదిక

అమలుకు వ్యతిరేకంగా అగ్రవర్ణాలు చేసిన ప్రదర్శనలు, శ్రమ జీవనాన్ని, శారీరక శ్రమను కించపరుస్తూ వారు చూపిన నిరసన రూపాలు దళిత చైతన్యాన్ని మరింత ప్రజ్వలింపజేశాయి. దళితుల ప్రతిఘటన చైతన్యానికి మార్గం వేసింది విప్లవోద్యమం. దళితవర్గాలకు సంబంధించిన కవులు విప్లవోద్యమంలో ప్రధాన పాత్ర వహించారు.

దళిత, స్త్రీవాద సాహిత్యాలు విప్లవ సాహిత్యోద్యమం నుంచి వచ్చి స్వతంత్రమైన అస్తిత్వాన్ని పొందడానికి ప్రయత్నం చేస్తున్న ఉద్యమాలు. రాజకీయ, ఆర్థికవ్యవస్థలో సమగ్రమైన మార్పులలో భాగంగా దళిత, స్త్రీ సమస్యలు పరిష్కారం అవుతాయా? సమాంతరంగా సాంస్కృతికరంగాలలో కూడా ఉద్యమాలు జరగాలా? అన్న చర్చలో రెండవ అంశానికి ప్రాధాన్యం ఇచ్చే క్రమంలో దళిత చైతన్య సాహిత్యం రూపుదిద్దుకుంది. విప్లవ సాహిత్యం దళిత సమస్యల్ని అర్థం చేసుకొనే పద్ధతి భిన్నం. వ్యవస్థ మార్పులో భాగంగా దళిత సమస్యల్ని విప్లవ సాహిత్యం చూస్తుంది. విప్లవ సాహిత్యం గురి వ్యవస్థ. దళిత సాహిత్యం గురి మనుస్మృతి. విప్లవ సాహిత్యం రాజకీయాలకు ప్రాధాన్యం ఇస్తుంది. దళిత సాహిత్యం సామాజిక, సాంస్కృతికాంశాలకు ప్రాధాన్యం ఇస్తుంది. విప్లవ సాహిత్యంలో దళితజన మనోభావనలు, దళిత సాహిత్యంలో విప్లవ ధోరణులు ఉన్నాయి. దళిత సాహిత్యంలో దళిత వర్గం స్వీయ అభివ్యక్తి (self expression) ఎక్కువ. విప్లవ సాహిత్యంలో సంఘటన, ప్రతిఘటనలకు సంబంధించిన అభివ్యక్తికి మాత్రమే ప్రాధాన్యం ఉంది. దళిత సాహిత్యంలోని పోరాట రూపాలు ప్రాధాన్య క్రమంలో ఇలా ఉంటాయి:

1. ఉత్పత్తి రంగంలో వెట్టిచాకిరిని, శ్రమదోపిడిని ఎదుర్కోవడం.[9]

2. బౌద్ధికరంగంలో ప్రతిభ పేరిట శ్రమను కించపరిచే సంస్కృతిని ఎదుర్కోవడం.[10]

3. సాంస్కృతిక రంగంలో 'సంస్కారం' అన్న పేరుతో చెలామణిలో ఉన్న అధికృతాభావాన్ని, అహంకారాన్ని బద్దలు కొట్టడం.[11]

4. సాహిత్యరంగంలో భాష, శిల్పం పేరిట ఉన్నత వర్గ దృక్పథం చుట్టూ అపరించుకొని ఉన్న దర్పాన్ని, మిథ్యను బద్దలుకొట్టడం. భాషా,

సాహిత్యాలకు సంబంధించిన ఉచ్చ, నీచ భావన సమాజంలోని ఉచ్చ, నీచ భావాలతో ముడిపడి ఉంది.

సలంద్ర 'దళిత మానిఫెస్టో' అన్న రచన ఈ అంశాలనన్నిటినీ క్రోడీకరిస్తుంది. దళిత మానిఫెస్టో అయినా పరిష్కారాలను విప్లవోద్యమంలోనే చూస్తాడు సలంద్ర.

నన్ను
నీ దేవుని గుళ్ళోకి రావద్దన్నావు
సరే, ఎలాగయితేనేం
నేను నాస్తికున్నవడమే బాగయింది.

నన్ను
చదువుకోవద్దన్నావ్
చదివితే నాలుక కోసేయమన్నావ్
వింటే చెవుల్లో
వేడి వేడి సీసపు లోహం పోయమన్నావ్
సరే, ఎలాగయితేనేం
నువ్వెంత మూర్ఖునివో
నీ వెంతటి విశాల హృదయుడివో
నాకు తెలిసిపోవడమే బాగయింది.

నన్ను
చచ్చిన శవాల
దహన సంస్కారాలే చూసుకోమన్నావ్
సరే, ఎలాగయితేనేం
మీ ప్రాణాలని కూడా
ఎలా పాతేయాలో
నాకు తెలవడమే బాగయింది.

..............................

నన్ను
ఎప్పుడూ ఊరి చివరనే వుండమన్నావ్
సరే, ఎలాగయితేనేం
నేను అడవిలో ఉండడమే బాగయింది
ఒకడేమో నను
అంటరానివాడంటే
మరొకడేమో హరిజనుడు
ఇంకో గాడిదకొడుకేమో
'నీచుడు' అని పిలవడం అలవాటే
ఎవడు ఎలా పిలుస్తే నాకేం
నేనొక నక్సలైట్‌నైనప్పుడు!

## ఉత్తర ఆధునికతగా దళిత సాహిత్యం :

పోరాట రూపాలు, పోరాట రంగాలలో ప్రాధాన్యత, అప్రాధాన్యతలు సమస్యలే కాకుండా ఇంకా అనేక అంశాలు దళిత సాహిత్యం ప్రత్యేక రూపాన్ని, స్వతంత్ర స్వభావాన్ని సంతరించుకోవడానికి కారణాలయ్యాయి. ఇది ఒక చారిత్రక క్రమం. ప్రపంచవ్యాప్తంగా వస్తున్న మార్పులలో భాగం. ఆధునికత అన్న భావనలో మానవతావాదం చాలా ముఖ్యమైన అంశం. ఉదార విశ్వజనీన ఆదర్శ మానవతావాదం ఆధునికత తొలిదశ. సమాజంలో శ్రామిక/పీడితవర్గం, యాజమాన్య/పీడకవర్గం అన్న రెండు ప్రధాన వర్గాలను గుర్తించడం రెండవ దశ. ఇవికూడ విశ్వజనీన/సామాన్యవర్గాలే. శ్రమకు, శ్రామిక శక్తికి ప్రాధాన్యం ఇచ్చే మానవతావాదం ఇక్కడ ప్రాధాన్యాన్ని వహించింది. తరువాత దశలో భిన్న ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక నేపథ్యాలుగల వర్గాలు గుర్తింపును కోరడం అన్న సమస్య ఆధునిక చైతన్యంగా ప్రవేశించింది.

వివిధ నేపథ్యాలుగల వర్గాలు ప్రధాన వర్గంలో భాగంగానే తమ ఉనికిని, ఆకాంక్షలను ప్రకటించుకోవడం ఈ దశలో కనిపిస్తుంది. పరిమిత (closed) సంఘ జీవన ప్రాధాన్యం గల భూస్వామ్య వ్యవస్థనుంచి విస్తృత (open) సమాజ జీవితంలో ప్రవేశించడంగా ఆధునికత ప్రారంభం అయింది. గత ఒకటి రెండు దశాబ్దాలుగా ఉత్పత్తి రంగంలో వచ్చిన మార్పులు, ఎలక్ట్రానిక్ పరిక

రాలు, ప్రసార సాధనాలు మరీ అట్టడుగులో ఉన్న వర్గాలను, మారుమూలల్లో ఉన్న వర్గాలను కూడా ప్రభావితం చేశాయి. వ్యవస్థలో తమ స్థానాన్ని గురించి తమ ప్రయోజనాలను గురించి ప్రశ్నించడం ప్రారంభమయింది. మరోవైపు మండల్ సమస్యలాంటివి అగ్రవర్గాలలో అణగి ఉన్న అహంకారాన్ని బట్ట బయలు చేశాయి. అవి దళిత చైతన్యాన్ని ప్రజ్వలింపజేశాయి. దీన్ని సాంస్కృతిక, సామాజిక రంగాలలో ఉత్తర ఆధునికతా దశగా భావించవచ్చు. ఈ దశ లోని చైతన్యం కింది విధంగా కనిపిస్తుంది:

1. ప్రాబల్య సంస్కృతిని ప్రశ్నించడం. సనాతన సంస్కృతి ఉన్నత సంస్కృతి పేరిట పై వర్గాల సంస్కృతే మొత్తం దేశ సంస్కృతిగా చెలామణీ కావడాన్ని ఎదుర్కోవడం.

2. ఆధిపత్య సంస్కృతిని ప్రతిఘటించడం. సామాజికంగా, రాజకీయంగా, సంస్థానిర్మాణపరం (organizational) గా, అవి ఏ సిద్ధాంతానికి సంబంధించినవైనా సరే, కొంతమంది ఆధిపత్య దృక్పథాన్ని నాయకత్వ స్పృహను నిరాకరించడం.

3. ఆదర్శీకరణ తిరస్కరణ. మహానుభావులు, గొప్ప వ్యక్తులు, గొప్ప సాహిత్యం, యుగకర్తలు అన్న భావనలను బద్దలు కొట్టడం. నీతి, ప్రబోధం, ప్రవక్తృత్వం, కొందరిని ఆదర్శ పురుషులుగా, కొన్ని రకాల సాహిత్యాన్ని ఆదర్శ సాహిత్యంగా నిలబెట్టడాన్ని నిరాకరించడం. స్వీయ అనుభవాలకు ప్రాధాన్యం ఇవ్వడం.

4. అమిథ్యాకరణం, సాంస్కృతిక, సాహిత్య రంగాలలో మార్మికమైన అభివ్యక్తులను, భావనలను ఛిన్నాభిన్నం చేయడం. వాటి చుట్టూ అల్లుకుని ఉన్న మిథ్యను బద్దలుకొట్టడం.

5. విభిన్న నేపథ్యాలుగల వర్గాల సామూహికమైన గుర్తింపు. భారతీయ సమాజంలో ఆధునిక చైతన్యాన్ని ప్రభావాల రూపంలోనే ఇంతవరకు గుర్తించడం జరుగుతున్నది. ప్రభావాలతో సంబంధం లేకుండా స్వీయ అనుభవాల

నుంచి సిద్ధాంతాలను నిర్మించుకోవడం ద్వారా గుర్తింపు చైతన్యం రూపుదిద్దుకొనే దశ ఉత్తర ఆధునిక దశ.

6. అభివృద్ధి అన్న భావనలో మార్పు. సామాజిక చరిత్రలో ప్రతిదశ పూర్వాపూర్వ దశలకంటే ఉన్నతమైనది, అభివృద్ధికరమైనది అన్న భావనను ప్రశ్నించడం. అభివృద్ధి, మార్పు అన్న భావనలలో మార్పురావడం.

7. సాహిత్య రంగంలో ఇంతవరకు వచ్చిన సాహిత్యాన్ని చదవడంలో, అవగాహన చేసుకోవడం (reading)లో మార్పు, దాని ఫలితంగా దళిత చైతన్యం సాహిత్యంలో ముందుకు తెచ్చిన ప్రశ్నలనేకం.[12]

(a) సాహిత్యంలో పై తరగతి దృక్పథానికో, మధ్య తరగతి దృక్పథానికో చెందిన భావజాలం మాత్రమే పునాదిగా వుంది. కింది తరగతి దృక్పథాన్ని ఆకాంక్షలను అవి ప్రతిఫలించడం లేదు.

(b) సామాజిక సమానత్వం ఆదర్శ రూపంలోను, సామ్యవాద భావన కాల్పనిక రూపంలోను మాత్రమే సాహిత్యంలో కనిపిస్తాయి. అవి వాస్తవికత మీద ఆధారపడి లేవు.

(c) ఉన్నవ 'మాలపల్లి', దానికి పోటీగా వచ్చిన ఎన్. జి. రంగా 'హరిజన నాయకుడు' నవలల పేర్లు ఎలా ఉన్నా దళిత సమస్యల విషయంలో అగ్రవర్ణ దృక్పథాన్నే ప్రదర్శిస్తున్నాయి కాని, వాటిలో దళితస్పృహ లేదు.

(d) వేయిపడగల విశ్వనాథకు స్థానం ఇచ్చిన 'వైతాళికులు' సంకలనం నాలుగు పడగల హైందవ నాగరాజును ప్రశ్నించిన జాషువాను ఎందుకు విస్మరించింది?

(e) సవరభాషకు వ్యాకరణం రాసిన గిడుగు రామమూర్తిని కీర్తించేవారు గోండుభాషను నేర్చుకొని ఆ భాషలో రచనలు చేసిన సాహుని గుర్తించనైనా గుర్తించదేమి?

(f) విశ్వనాథకు ప్రత్యామ్నాయంగా జాషువాను కాక శ్రీశ్రీని ముందుకు ఎందుకు పెట్టవలసి వచ్చింది?

(g) గత రెండు మూడు దశాబ్దాలలో రచయితలు నిర్బంధానికి గురిఅయినప్పుడు భిన్న వర్గాలకు సంబంధించిన రచయితల విషయంలో భిన్నమైన స్పందనలు ఎందుకు వచ్చాయి?

వర్తమాన చరిత్ర క్రమాన్ని అర్థం చేసున్నప్పుడే, అనివార్యంగా చరిత్ర ఏ దిశగా నడుస్తున్నదో అవగాహన అయినప్పుడే దళిత చైతన్యం/సాహిత్యం- అవి ముందుకు తెచ్చిన ప్రాసంగికత తెలుస్తాయి. ప్రస్తుతం చరిత్ర గమనం పైనుంచి (from the above) కింది వైపు (to the below)గా ఉన్నది. దీనివలన ఈ భూమిపైననే రాజకీయ, సామాజిక వ్యవస్థలలో అనివార్యంగా గుణాత్మకమైన మార్పులకు దారితీసే అవకాశం ఉంది. ఈ చారిత్రక పరిణామక్రమంలో మన సమాజంలో దళిత చైతన్యం, దానికి సంబంధించిన సాహిత్యం అంతిమదశ కాదు- అది ఒక దశ మాత్రమే.

## జ్ఞాపికలు

1. మాల మాల గాడు మహిమీద నెచ్చోట
   మాట దిరుగువాడె మాలగాని
   వాని మాలయన్నవాడెపో పెనుమాల ॥విశ్వ॥

   —వేమన

2. ఏ కులమని నను వివరంబడిగితే
   ఏమని చెప్పుదు లోకులకు, పలుగాకులకు దుర్మార్గులకు

   —సిద్దప్ప

3. మలినదేహుల మాల లనుచును
   మలినచిత్తుల కధిక కులముల
   నెలవొసంగెడు వర్ణధర్మమ
   ధర్మధర్మంబె
   కులము లేదట వొక్కవేటున
   పసరముల హింసించువారికి

కులము కలదట నరుల్పైవేచెడి
క్రూర కర్మలకున్.

—గురజాడ అప్పారావు

4. మాలమాదిగవారమండి మమ్ము
చాలగ ప్రేమించి - పాలింపరండి ॥మాల॥
......................................................
హీనపు మాల లనకండి - ఎల్ల
మానవులం దొక - యాత్మే కదండి ॥మాల॥
......................................................
గాంధి బోధల వినరండి - మాకు
బంధవిముక్తికి - బని బూనరండి ॥మాల॥

—నెల్లూరు వెంకటరామానాయుడు

5. పామునకుఁ బాలు, చీమకుఁ బంచదార
మేపుకొనుచున్న కర్మభూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మదేవతకుఁగూడ
నులికిపడు జబ్బుగలదు వీఁడున్నచోట.
ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి
యినుపగజ్జెలతల్లి జీవనము సేయుఁ
గసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గుపడగల హైందవనాగరాజు.

—జాషువా

6. కుక్కలకన్న తక్కువంచు మము వెక్కిరించుతారె
చక్కని పంటలు పండిస్తేను చల్లగా తింటారె
వీటినన్నిటిని ముట్టినవారికి వెగటే లేదండి
మమ్ముల ముట్టగమాత్రము వారికి వెగటు పుట్టునండి!

—జాలా రంగస్వామి

రాజమహేంద్రవరానికి చెందిన జాలా రంగస్వామి 'అంటరానివా రెవరు?', 'మాలశుద్ధి' అన్న రచనలను స్వయంగా రచించి, 1930 లో స్వయంగా ప్రచురించాడు. 'అంటరానివా రెవరు?' చారిత్రక దృష్టితో రచించిన సుదీర్ఘ కవిత. 'మాలశుద్ధి' కీర్తనల సంకలనం.

7. ఏపూట కాపూట ఏపుకుని తింటారు
కూడడిగితే తప్పు కూలడిగితేముప్పు
కులము మతమంటారు ఓరన్నా
దొరలు కలవనీయరు మనల కూలన్నా
ఏ కులము వారైన ఏ దేశమందున్న
పేదలంతా ఒకటి బాధలన్నీ ఒకటి
కులము కూడెట్టదుర ఓరన్నా
మనము కలిసిపోరాడాల కూలన్నా

—రైతు

(జనం పాటలు, విజయవాడ, మైత్రి బుక్‌హౌజ్, 1981)

8. మాలోల్ల మంటావు మాదిగల మంటావు
మాట మాటాడితే దూరముండంటావు
నీ రక్తమెట్టుండెనో ఓరోరి
మా రక్తమెరుపుండెరా....
మన్ను మలను తాకితే మైలపుతనంటావు
మా గాలి సోకితే గంగలో మునిగేవు
నీ యిల్లు ఎవడుగట్టే ఓ రోరి
నీ బాయి ఎవడు దవ్వే

..............................

భూములూ, జాగాలు ఇప్పిస్తననిజెప్పి
ఊరి బయటా మాకు పూరిళ్ళు కట్టించి
అంటరానితనమూ ఓరోరి
పోషించుచున్నావురో
కులము మతమూ లేక పేద ప్రజలందరితో
కలసిపోతూ మేము కదలివస్తున్నాము
ఉన్నవాళ్ళ రాజ్యమూ - ఓరోరి
పూడగొట్టేస్తామురా
పేదవాళ్ళ రాజ్యమూ - ఓరోరి
సాధిందుకుంటామురో!

—బి. యన్. బి.

(మాలోల్లమంటావు జనం పాటలు)

9. ముల్లవనం నరికి నరికి
పండ్లవనం చేసినోడ
భూమిని తలకిందుజేసి
బువ్వ పంచి యిచ్చినోడ
అంతను ఇంతజేసి
గింతకైన నోచనోడ
ఆ పండ్లకైన నోచుకోక
బతుకు నిండిపోయినాడు! —గద్దర్

10. మీరు పగులగొట్టిన అద్దాలను అతికించి అందులో
మా భవిష్యత్తును దర్శిస్తాం
సుదీర్ఘంగా రైళ్ళమై సాగిపోతాం
మీరంతా డాక్టర్లై
మీరంతా ఇంజనీర్లై
మీరంతా శాస్త్రవేత్తలై, మహాప్రతిభావంతులై
పరదేశాలకు పారిపోయేవాళ్ళు
ప్రతిభను విదేశాలకు అమ్ముకునేవాళ్లు
మాకున్న ప్రతిభంతా మా దేశానికి స్వంతం
మా దేశానికి మా ప్రతిభ చాలు
ఇక మీకూ అంతగా సమయం కాదు
అంతస్థులు దిగిరండి
ఒక బూటుకాదు - బూట్లన్నీ పాలిష్ చేయండి
మాకు రిజర్వేషన్లు వద్దు
ఒక వీధి కాదు - వీధులన్నీ ఊడ్వండి
ప్రతిరోజూ ఊడ్వండి
మాకు రిజర్వేషన్లు వద్దు
ఒక రోజు కాదు - జీవితాంతం అడుక్కుతినండి
అందరూ అడుక్కుతినండి
మాకు రిజర్వేషన్లు వద్దు
(మా దేశానికి మా ప్రతిభ చాలు - సాహస)
మానవస్మృతి, విరసం ప్రచురణ, 1990.

11. "నీకు చచ్చినా అర్థం కాదురా" అని
మీరు తిట్టుకుంటూ చెప్పిన వేళ్ళమీద లెక్క
నాకు చచ్చాకనే అర్థమయ్యింది
నిజం చెప్పండి
పంచముడంటే అయిదోవేలు లేనివాడనేనా అర్థం.
-(పంచమవేదం - సతీష్‌చందర్)

12. 'దళితవాయిస్' ఏప్రిల్, 1992 సంచికలో సాహుతో ఇంటర్వ్యూ, తదితర వ్యాసాలు ఆధారంగా.

# తెలుగులో దళిత సాహిత్యం

—డా॥ ఎస్వీ సత్యనారాయణ

తెలుగులో "దళిత సాహిత్యం" ...అంటే దళితుల సమస్యలను చిత్రించిన సాహిత్యం - చాలా కాలం నుండి వెలువడుతున్నది. అయితే దళిత రచయితలే దళిత సాహిత్యాన్ని సృష్టించడం యిటీవలి పరిణామం. దళితేతరులు దళితుల పక్షాన్ని వహించి రాయడం 'ఉదారవాదం.' దళితులే తమ సమస్యలకు ప్రతి స్పందించి రాయడం 'ఆత్మాభిమానవాదం.'

ఇంతకూ దళితులంటే ఎవరు?

సాంఘిక దోపిడికి గురవుతున్నవారు, అస్పృశ్యులుగా పరిగణింపబడు తున్నవారు, నీచవృత్తులుగా భావింపబడుతున్న వృత్తులు చేసుకుంటున్నవారు, శారీరకశ్రమపై ఆధారపడి బతుకులు గడుపుతున్నవారు - దళితులు.

శతాబ్దాలుగా విద్యకు, విజ్ఞానానికి, వికాసానికి దూరం చేయబడిన దళితులు నేడు విద్యావంతులౌతున్నారు. ఆలోచిస్తున్నారు. సంఘటితు లౌతున్నారు. చైతన్యవంతులౌతున్నారు. ఉద్యమిస్తున్నారు. సాటి దళిత సోదరులను చైతన్యపరచటానికి సాహిత్యాన్ని ఆయుధంగా ఉపయోగిస్తున్నారు. వీరి ఉద్య మాన్ని 'దళిత ఉద్యమం' గా పరిగణిస్తున్నాం.

## దళిత ఉద్యమం :

జాతీయోద్యమ కాలంలో 'అస్పృశ్యత'కు వ్యతిరేకంగా విస్తృత ప్రచారం జరిగింది. వామపక్ష ఉద్యమంలో భాగంగా కూడా 'కులతత్వం'పై పోరాటం జరుగుతున్నది. వర్ణ దురహంకారాన్ని తీవ్రంగా ప్రతిఘటించడం కొనసాగు తున్నది. అయితే ఈ ఉద్యమాలు వర్ణవ్యవస్థపై ప్రత్యక్ష పోరాటానికి పిలుపు నివ్వలేదు. బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయోద్యమ యోధులు

పోరాడారు. పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా వామపక్షాలు ప్రజా ఉద్యమ రూపాలు చేపడుతున్నాయి.

వీటికి భిన్నంగా డా॥ బి.ఆర్. అంబేద్కర్ 'వర్ణపోరాటానికి' పిలుపు నిచ్చారు. చాతుర్వర్ణ్య వ్యవస్థకు వ్యతిరేకంగా 'సాంఘిక విప్లవం' కొనసాగాలన్నారు. 'సామాజిక న్యాయం' కోసం త్రిముఖ పోరాటాన్ని నిర్దేశించారు. సర్వమానవ సమానత్వం, సుఖమయ జీవితం, మానవ విలువల పరిరక్షణ కాంక్షించారు.

దళితులకు రాజ్యాంగపరమైన రక్షణలు; సౌకర్యాలు కల్పించడం; పార్లమెంటులోనూ, అసెంబ్లీలోనూ కొన్ని స్థానాలను గెలిచి, దళితుల సాంఘిక న్యాయంకోసం కృషి చేయడం; రిజర్వేషన్ల సక్రమ అమలుకు పాటుపడటం - వంటి ప్రధాన ఆశయాలను డా॥ అంబేద్కర్ ప్రబోధించారు. ఆ మహనీయుని సిద్ధాంతాల ప్రాతిపదికపై నడుస్తున్న ఉద్యమాన్ని 'దళిత ఉద్యమం' అంటున్నాం.

డా॥ బి. ఆర్. అంబేద్కర్‌కు ముందే చాలామంది సాంఘిక విప్లవకారులు సాగించిన వివిధ పోరాటాలు ఈ ఉద్యమానికి కావలసిన నేపథ్యాన్ని సమకూర్చి పెట్టాయి.

నిమ్న వర్గాల ఉద్ధరణ కోసం మహారాష్ట్రలో మొదటిసారిగా 'జ్యోతి బాపూలే' (1827-1890) తిరుగుబాటుకు పిలుపు నిచ్చాడు. 1874 లో 'సత్య శోధక్ సమాజ్' అనే సంస్థను స్థాపించి, దళితులను జాగృతపరచడానికి విశేషమైన కృషి చేశాడు. 1910 నాటికి దళితుల సమస్య ఒక 'ఆందోళన' రూపం దాల్చింది. శివరామ్ కాంబ్లే 'నిమ్నజాతులవారి మహాసభ'ను ఏర్పాటు చేశాడు. 'సోమవంశీయ మిత్ర' అనే మాస పత్రికను వెలువరించాడు. అదేకాలంలో కర్మవీర్‌షిందే దేశం నలుమూలలా పర్యటించి, నారాయణ్ చందావర్కర్ సహకారంతో 'దళిత జాతుల సేవా సంఘం' స్థాపించాడు.

కలకత్తా కాంగ్రెస్ సమావేశం (1917) దళితుల అభివృద్ధిని కోరుతూ, అస్పృశ్యతను నిరసిస్తూ తీర్మానాలు చేసింది. అదే సంవత్సరం 'మాంటేగ్' కమిటీ దేశంలోని వివిధ రాజకీయ వర్గాల ప్రతినిధుల అభిప్రాయాలతో బాటు, అస్పృశ్యుల ప్రతినిధుల అభిప్రాయాలను కూడా సేకరించడానికి భారతదేశం వచ్చింది. దీనితో దళిత జాతుల ప్రతినిధులు మొదటిసారిగా దేశ రాజకీయ రంగంలోకి రాగలిగారు.

1918 మార్చి 23, 24 తేదీల్లో బొంబాయిలో మొదటిసారిగా 'అఖిల భారత దళిత జాతుల సమావేశాలు' జరిగాయి. 1919 నాటి బ్రిటిష్ చట్టం ద్వారా పరిపాలనా వ్యవస్థలో మొట్టమొదటిసారిగా దళితుల ఉనికి కానవచ్చింది. కేంద్ర అసెంబ్లీలోని 14 మంది అనధికార సభ్యుల్లో ఒక దళితజాతి ప్రతినిధికి అప్పటి ప్రభుత్వం అవకాశం కల్పించింది.

దళిత జాతుల జనాభాను అనుసరించి వారికి కేంద్ర అసెంబ్లీలోనూ, శాసన సభల్లోనూ కొన్ని సీట్లు కేటాయించాలనీ, సవర్ణహిందువులు దళితుల పట్ల తమ వైఖరిని మార్చుకోవాలనీ, స్వపరిపాలన సిద్ధించడానికి ముందు సాంఘిక సమానత్వం సమకూరాలనీ - డా॥ బి. ఆర్. అంబేద్కర్ వాదించారు. తమ అభిప్రాయాలను అటు ప్రభుత్వానికి, ఇటు ప్రజలకూ తెలియజేయడానికి 'మూక్ నాయక్' పత్రికను ప్రారంభించారు.

1924 మార్చిలో డా॥ అంబేద్కర్ అస్పృశ్యతా నివారణోద్యమాన్ని మొదలుపెట్టారు. మార్చి 9న బొంబాయిలోని దామోదర్‌హాల్‌లో 'దళిత సమావేశం' జరిగింది. అక్కడ 'బహిష్కృత హితకారిణీ సభ' రూపొందింది.

'దళితులు తమ స్థితిని తాము గుర్తెరిగి తమను తామే ఉద్ధరించుకోవాలి. తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలగాలి. సవర్ణులకన్నా తాము ఎందులోనూ తక్కువ కాదని గ్రహించాలి' - అనే చైతన్యయుతమైన ప్రబోధాన్ని డా॥ బి. ఆర్. అంబేద్కర్ దళిత జాతులకు అందించారు. 'శూద్రులంటే ఎవరు?', 'అస్పృశ్యులెవరు?', 'కులనిర్మూలన,' 'భారతదేశంలో కులాలు,' 'రాముడు ఆదర్శపురుషుడా?' మొదలైన పుస్తకాలను, వందలాది వ్యాసాలను రాశారు.

డా॥ అంబేద్కర్ సిద్ధాంతాల వెలుగులో ఈనాడు దేశంలోని అనేక ప్రాంతాల్లో 'దళిత ఉద్యమం' విస్తరిస్తున్నది.

## దళితసాహిత్యం :

దళితుల నుండి రచయితలు ఉద్భవించి, దళితుల కోసం రచనలు చేయడం ఈ ఉద్యమానికి గీటురాయి.

వర్ణ వ్యవస్థ వేల యేళ్ళుగా దళితులకు విద్యను నిషేధించింది. అందుకే దాని నిర్మూలనకు దళితులు పోరాడుతున్నారు. బ్రాహ్మణ్యం దళితుల హక్కు-

లను కాలరాచిందనే భావం ప్రబలింది. అందుకే వాళ్ళు దాన్ని వ్యతిరేకి స్తున్నారు.

దళితుల సమస్యను చిత్రించిన తొలి భారతీయ నవల ముల్కరాజ్ ఆనంద్‌గారి 'అన్‌టచబుల్.'

మున్షీ ప్రేమ్‌చంద్, రవీంద్రనాథ్ ఠాగూర్ వంటి రచయితలు తమ రచనల్లో అస్పృశ్యతను నిరసించారు.

తెలుగులో దళితుల సమస్యలను, ముఖ్యంగా అస్పృశ్యతను వేర్వేరు కోణాల్లో చిత్రించిన ప్రముఖ నవలలుగా ఈ క్రింది వానిని పేర్కొనవచ్చు:

తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారి 'హేలావతి' (1913), వెంకట పార్వతీశ్వర కవుల 'మాతృ మందిరము' (1919), ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి' (1922), ఆచార్య రంగనాయకులుగారి 'హరిజన నాయకుడు' (1933), అడివి బాపిరాజుగారి 'నరుడు' (1946), ఇలింద్ర రంగనాయకుల 'మల్లిక' (1950), వట్టికోట ఆళ్వార్‌స్వామిగారి 'ప్రజల మనిషి' (1955), ముప్పాళ్ళ రంగనాయకమ్మగారి 'బలిపీఠం' (1962), మహీధర రామ్మోహన రావుగారి 'కొల్లాయి గట్టితేనేమి?' (1965), మల్లాది వసుంధర 'త్రివర్ణపతాక' (1965), వాచస్పతిగారి 'అంతస్తులు - అంతఃకరణాలు' (1965), దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు' (1970), డా॥ కేశవరెడ్డిగారు రాసిన 'బానిసలు' (1971), 'శ్మశానం దున్నేరు' (1979), 'ఇన్‌క్రెడిబుల్ - గాడెస్' (1979); ఇల్లిందల సరస్వతిగారి 'నీ బాంచను కాల్మొక్కుతా' (1976) మొదలైనవి.

అలాగే హరిజనుల సమస్యలను కొన్నింటిని చిత్రించిన నవలల్లో 'ఆదర్శం' (1946), 'అంటరాని జంట' (1973), 'విరిగిన కెరటాలు' (1977), 'మిసెస్ కోకిల' (1979), 'చివరి మజిలీ' (1978), 'వేర్లు' (1979), 'మోహనరాగం' (1979), 'కోటిగాడు' (1980), 'చీకటి చెదిరింది' (1981), 'తపోభంగం' (1981), 'చీకట్లో కాంతిరేఖలు' (1983), 'నైమిశారణ్యం' (1984), 'కులకన్య' (1985), 'అంతులేని అమావాస్య' మొదలైనవాటిని పేర్కొనవలసి ఉంటుంది.

'దళితుల్లో దళిత చైతన్యాన్ని' మేల్కొలిపిన మొదటి రచయిత 'జ్యోతి బాపూలే.' దళితులను విద్యావంతులను చేయడానికి తన సాహిత్యాన్ని, జీవితాన్ని, మేధస్సునూ అంకితం చేసిన మేధావి డా॥ అంబేద్కర్.

జీవితంలోని అన్ని రంగాలతోపాటు సాహిత్యరంగంలోనూ దళితులు నిరాదరణకు గురయ్యారు. గత వేలాది సంవత్సరాలుగా వెలువడుతున్న సాహిత్యంలో దళితుల్ని బానిసలుగా, బెస్తవాళ్ళుగా, ఉరితీసే తలారులుగా, నీచులుగా చిత్రించడం జరిగింది. దళితవనితలను దాసీలుగా, భోగించుటకు పనికివచ్చే విలాస వస్తువులుగా వర్ణించడం జరిగింది. వీళ్ళను మనుషులుగా పరిగణించలేదు. వ్యక్తిత్వం ఉన్నవాళ్ళుగా చిత్రించలేదు. దళితేతరులను మాత్రమే శక్తివంతంగా చిత్రించడం జరిగింది.

ఈ వివక్షతను ప్రతిఘటిస్తూ, దళితుల సంవేదనలను, బాధలను, అనుభవాలను, అనుభూతులను చిత్రించడంతోపాటు దళితులపై జరుగుతున్న అత్యాచారాలను శక్తివంతంగా అభివ్యక్తం చేయడానికి 'దళిత సాహిత్యం' ప్రారంభమయింది.

'దళిత ఉద్యమం'లోని సిద్ధాంత విభేదాలు, అంతర్గత వైరుధ్యాలు కూడా అనివార్యంగానే 'దళిత సాహిత్యం'లోనూ ప్రతిబింబిస్తున్నాయి.

1967 దాకా 'దళిత సాహిత్యం' తన సైద్ధాంతిక పునాదిని పటిష్ఠపరుచుకుంటూ వచ్చింది. జ్యోతి బాపూలే, శాహూ మహరాజ్, డా॥ అంబేద్కర్; కార్ల్‌మార్క్స్, మావో సెటూంగ్‌ల సిద్ధాంతాలు; నీగ్రో సాహిత్యంలోని తిరుగుబాటు దృక్పథం - తన తాత్వికపూర్వరంగంగా స్వీకరించింది. అదే సంవత్సరం ఔరంగాబాద్‌లో 'మిళింద సాహిత్య పరిషత్' ఏర్పడింది. దళితుల అభివ్యక్తికోసం 'అస్మిత' అనే త్రైమాస పత్రిక ప్రారంభమయింది. 1967 నుండి ఈనాటిదాకా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న ఆ పత్రిక పేరిప్పుడు 'అస్మితాదర్శ'. 1969 నుండి 'దళిత సాహిత్యం'అనే పదం విస్తృత వ్యవహారంలోకి వచ్చింది.

1920 లోనే బెంగాలీ భాషలో దళితపత్రిక వెలువడింది. ఆ తరువాత వివిధ భాషల్లో - "ప్రబుద్ధ భారత్, అస్మిత, అస్మితాదర్శ, మూక్‌నాయక్, భీంపత్రిక, జనతా, ప్రమేయ, నికాయ, జాయజా, సింహగర్జన, శ్రామిక్ విచార్ మున్నగు పత్రికలు దళిత సాహిత్య వ్యాప్తికి విశేషమైనకృషి చేశాయి. వీటిలో కొన్ని పత్రికలు నేటికీ వెలువడుతూనే ఉన్నాయి.

1981 లో ఢిల్లీలో 'భారతీయ దళిత్ సమాచార పత్రికా సంపాదకుల సమ్మేళనం' జరిగింది. 1984 ఆగష్టు 18 న ఢిల్లీలో 'భారతీయ దళిత సాహిత్య అకాదమీ' స్థాపింపబడింది. అదే సంవత్సరం ఈ అకాదమీ పక్షాన "డా॥ అంబేద్కర్ జాతీయ అవార్డు", "డా॥ అంబేద్కర్ అంతర్జాతీయ అవార్డు" కమిటీలను నెలకొల్పి; ప్రతి సంవత్సరం జాతీయ, అంతర్జాతీయ స్థాయుల్లో దళితుల వికాసానికి విశేషమైన కృషి చేసిన వారికి ఈ అవార్డులను ఇవ్వడం జరుగుతున్నది.

ఈ కేంద్ర అకాదమీతో పాటు అనేక రాష్ట్రాల్లో రాష్ట్రస్థాయి 'దళిత సాహిత్య అకాదమీలు' ఏర్పాటయి, దళిత రచయితలను ప్రోత్సహించడానికీ; దళిత సాహిత్యవ్యాప్తికీ కృషి చేస్తున్నాయి.

1987 అక్టోబర్ 8-10 తేదీల్లో హైదరాబాద్ నగరంలోని ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో 'అఖిల భారత దళిత రచయితల ప్రథమ మహాసభలు' జరిగాయి. దాదాపు 17 రాష్ట్రాల నుండి 528 మంది ప్రతినిధులు పాల్గొన్న ఈ మహాసభలు 'అఖిల భారత దళిత రచయితల సంఘాన్ని' ఏర్పాటు చేసుకున్నాయి. ఒక నిర్దిష్టమైన ప్రణాళికను రూపొందించుకున్నాయి.

'మానవ విలువలు, స్వేచ్ఛ, సమానత్వం సౌభ్రాతృత్వంపై ఆధారపడిన వర్ణరహిత సమాజ నిర్మాణం' ఈ మహాసభ ఆశయంగా దళిత రచయితలు ప్రకటించారు. 'సాంఘికంగా, ఆర్థికంగా దోపిడికి గురయిపోతున్న వర్గాలను దళితులుగా' మహాసభ నిర్వచించింది.

'దళితులకు సమాజంలోనూ, సాహిత్యంలోనూ సముచిత స్థానాన్ని సంపాదించటానికి పోరాటాలు నిర్వహించడం; అలా చిత్రించే సాహిత్యాన్ని విరివిగా సృజించడం' తమ లక్ష్యాలుగా ఈ మహాసభ ప్రకటించింది.

'దళిత సాహిత్యం కేవలం దళితుల జీవితాలను చిత్రించడంతోనో, దళితులను ప్రేరేపించడంతోనో దీని కర్తవ్యం పూర్తికాదు; దళిత చైతన్యాన్ని దళితుల్లో రగిలించి, వారిలో పోరాడే ధైర్యాన్ని మేల్కొల్పాలి. దళిత రచయితలు దళితుల విముక్తి కోసం కూడా తమ కలాలను అంకితం చేయాలి' అనే ఉత్తేజకరమైన పిలుపును దళిత రచయితలకు ఈ అఖిల భారత మహాసభ ఇచ్చింది.

1992 నవంబర్ 14, 15 తేదీల్లో గుంటూరులో జరిగిన "ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం (అరసం)" 11వ రాష్ట్ర మహాసభలు 'దళిత సాహిత్యం'పై సదస్సు నిర్వహించి, విస్తృత చర్చలు జరిపాయి. 'సాహిత్యంలో దళిత చైతన్యం' హర్షించదగిన, ఆహ్వానింపదగిన పరిణామమని 'అరసం' ప్రకటించింది.

1993 ఫిబ్రవరి 13, 14 తేదీల్లో హైదరాబాద్‌లోని డా॥ బి. ఆర్. అంబేద్కర్ భవన్‌లో 'ఆంధ్రప్రదేశ్ దళిత రచయితలు, కళాకారులు, మేధావులు ఐక్యవేదిక" ప్రథమ మహాసభలు జరిగాయి. రాష్ట్రంలోని అనేక జిల్లాల నుండి దళిత రచయితలు ప్రతినిధులుగా పాల్గొన్న ఈ మహాసభల్లో సుదీర్ఘమైన చర్చలు, ప్రయోజనకరమైన ప్రతిపాదనలు జరిగాయి. దళితుల్లో ఆత్మాభిమాన చైతన్యాన్నీ, ప్రతిఘటన చైతన్యాన్నీ రేకెత్తించడానికి సాహిత్యాన్ని ఒక ప్రతిభావంతమైన ఆయుధంగా వినియోగించుకోవాలని ఈ మహాసభలు దళిత రచయితలకు పిలుపు నిచ్చాయి. ఈ మహాసభల ప్రేరణతో కరీంనగర్, వరంగల్, రంగారెడ్డి, అనంతపురం జిల్లాల్లో 'దళిత సాహిత్యం' పై సదస్సులు జరిగాయి, జరుగుతున్నాయి. దళిత స్పృహతో సాహిత్య ప్రక్రియలు వెలువడు తున్నాయి.

## దళిత కవిత్వం :

దళితుల సమస్యలను కవిత్వంలో ప్రతిబింబింప చేసిన గుర్రం జాషువాను తొలి తెలుగు దళిత కవిగా భావించవచ్చు. 'గబ్బిలము', 'అనాధ' వంటి పద్య కావ్యాల ద్వారా 'అస్పృశ్యత' సమస్యను చిత్రించిన 'జాషువా' దళిత సాహిత్యంలో ప్రతిఘటన చైతన్యానికి ప్రతీకగా నిలుస్తాడు.

> 'కలడంబేద్కరు నా సహోదరుడు మాత్రై యష్టకష్టాలకుం
> బలియై సీమకు వోయి, క్రమ్మరిన విద్వాంసుడు వైస్రాయి మే
> ల్కొలు వందుంగల దొడ్డవా డతడు నీకుం స్వాగతం బిచ్చి పూ
> వుల పూజల్ పొనరించేనే యతని మెప్పుల్ నీ జయారంభముల్'

-అనే పద్యంలో అంబేద్కర్ ప్రతిభావ్యుత్పత్తులను జాషువా కొనియాడారు. అంబేద్కర్‌ను ప్రశంసించడమంటే దళితులు తమను తామే ప్రశంసించుకోవడమే నన్నారు.

జాషువా తరువాత పేర్కొనదగిన దళిత కవులు - జాలా రంగకవి, కుసుమ ధర్మన్నకవి, నక్కా చినవెంకయ్య, నూతక్కి అబ్రహాం, ప్రేమయ్య మొదలగువారు. జాతీయోద్యమ కాలంలో 'అస్పృశ్యత'ను నిరసిస్తూ యీ కవులు కవిత్వాన్ని వ్రాశారు

ఆ తరువాతి తరం దళితకవి బోయి భీమన్న.

'కూలగొట్టుడు కులమత కుటిలతలను
సమము చేయుడు మానవ సామ్యములను
పీడిత జనమ్ము న్యాయము పీడనేని

మకర కుండలమ్ములు మిమ్ము మనుపగలవె?' - అని ప్రశ్నిస్తున్న భీమన్న సాంఘిక సమానత్వాన్ని ప్రబోధిస్తూ అనేక కావ్యాలు రచించారు. అస్పృశ్యుల ప్రతినిధిగా నిలిచిన డా॥ బి. ఆర్. అంబేద్కర్ మేధాసంపత్తిని చూసి మేధావులే ఆశ్చర్యపోయారన్న అభిప్రాయాన్ని భీమన్న వ్యక్తం చేస్తూ —

'చదువులేనివాడు, సంస్కారహీనుడు
మురికి పేటలందు మురుగువాడు
పొట్టకూటివాడు, వెట్టిచాకిరివాడు
వాయి తెరువ ద్విజుల వాక్కులైరి'

-అంటూ అభివర్ణించారు. తరతరాలుగా సంస్కారహీనుడిగా పరిగణింపబడిన దళితుడు తన తెలివితేటలను ప్రదర్శిస్తే ఎవరికి తీసిపోడని ప్రకటించారు.

ఆంధ్రదేశంలో దళిత ఉద్యమ రథసారథుల్లో ఒకరైన బొజ్జా తారకం కూడా ఈ రంగంలో కృషి చేస్తున్నారు. దళితులను చైతన్యపరిచే వీరి కావ్యం 'నదిపుట్టిన గొంతుక'లో—

'పుట్టుకనే పెట్టుబడి పెట్టి
బతుకులను విపణి వీధిలో పెట్టిన
వ్యాపారారణ్యాన్ని నరుక్కుంటూ
మనిషి మనిషికి తేడా తీసిన
కుల మతాల గోతులు పూడ్చుకుంటూ
నీ కోసం బాటలు వేసుకొస్తున్నాను
తూర్పు నుంచి చరచరా పైకి వస్తున్న

సూర్యుడివా నువ్వు....?' — అంటున్న 'తారకం' దళితుల్లో ఆత్మ విశ్వాసాన్ని, తిరగబడే చైతన్యాన్ని, పోరాడే స్పృహను తమ రచనల్లో పలికిస్తున్నారు.

దళిత జనజాగృతి కోసం సాహిత్యాన్ని వక్తృత్వాన్ని, క్రియాశీల కార్య కర్తృత్వాన్ని ప్రముఖంగా ఉపయోగిస్తున్న ప్రతిభాశాలి కత్తి పద్మారావు వచన కవిత్వంలో 'దళిత స్పృహ'ను వికసింపజేస్తున్నారు.

అలాగే దళిత వచన సాహిత్యాన్ని పరిశీలిస్తే—

కొలకలూరి ఇనాక్‌గారి 'ఊరబావి' కథలు, 'మునివాహనుడు' నాటకం; బోయ జంగయ్యగారి 'జాతర' నవల; హైదరాబాద్ బుక్‌ట్రస్టు వారు ప్రచు రించిన అనువాద కథల సంకలనం 'దళిత కథలు'; బి. ఎస్. రాములుగారి 'బతుకు పోరు' (నవల), 'పాలు '(కథల సంపుటి), 'గతితర్క తత్వదర్శన భూమిక' (దార్శనిక గ్రంథం); విశాల సాహిత్య అకాడమీ (కరీంనగర్) వారు ప్రచురించిన 'గతితర్కం - అంబేద్కరిజం - మార్క్సిజం' మున్నగు రచనలు విధిగా పేర్కొనదగినవి.

పైన పేర్కొన్న కవులు, వచన రచయితలు చాలామంది కులతత్వానికి వ్యతిరేకంగా ప్రబోధించేది 'వర్ణపోరాటమార్గం.' ఇందులో పోరాడే సామాజిక శక్తులు 'దళితులు' మాత్రమే.

ఇక వర్ణపోరాటాన్ని వర్గపోరాటంలో భాగంగా కొనసాగించాలని ప్రబోధిస్తున్న 'దళితవర్గకవులు' కూడా సాహిత్యరంగంలో కనబడుతున్నారు. వారి సాహిత్యంలో కనబడుతున్న పోరాడే సామాజిక శక్తులు 'పీడితులు.'

దళిత చైతన్యంతో కలం పట్టకపోయినా, నక్సలైట్ ఉద్యమ ప్రేరణతో కవిత్వం రాసిన సుబ్బారావు పాణిగ్రాహి రచనలు దళిత కవిత్వంలో వర్గ దృక్పథంతో రాస్తున్న యువకవులకు ఉత్ప్రేరకాలుగా పనిచేస్తున్నాయి,

'కొండల పక్కన బండలు కొట్టే
గిరిజనుడా! ఇటు రావయ్యా!
ఓ గిరిజనుడా! ఇటు రావయ్యా!
పుట్టల పక్కన కట్టెలు కొట్టే
గిరిజనుడా! ఇటు రావయ్యా!
ఓ గిరిజనుడా! ఇటు రావయ్యా!'

-అంటూ ఎలుగెత్తి పిలిచిన 'ఏజెన్సీలో ఎర్రజెండా' గీతం, 'జనత మేలుకొన్నది', 'మేలుకో', 'తూర్పుజెండా' మొ॥ గీతాలద్వారా ఆదివాసి ప్రజల ఆలోచనలను పదునుబెట్టి కదనరంగానికి నడిపించిన కవి సుబ్బారావు పాణిగ్రాహి.

పాణిగ్రాహి తరువాత గిరిజనుల్లో వర్గపోరాట స్పృహను వేడెక్కించిన దళితకవి 'శివసాగర్.'

'తోటరాముని తొడకు కాటా తగిలిందని
చిలుక చీటీ తెచ్చెరా! ఓ చిలుకాడ!
మైనా మతలబు చేసెరా! ఓ చెలికాడ!
మైనా మతలబు చేసెరా!' - అని ప్రారంభమయ్యే గీతంలో శివసాగర్ సృష్టించిన వాతావరణం, గ్రహించిన ప్రేరణ, సంకేతించిన పిట్టలు - గిరిజనుల జీవితాల నుండి స్వీకరించారు.

ప్రస్తుతం దళిత సాహిత్య వ్యాప్తికై జీవితాన్ని అంకితం చేసి కృషిచేస్తున్న దళితవర్గ పోరాటకవి 'శివసాగర్' (కె.జి. సత్యమూర్తి).

ఈ బాటలో పాటలల్లి, బలమైన గొంతుతో దళిత గర్జన వినిపిస్తున్న కవి 'గద్దర్.'

'యాలరో ఈ మాదిగ బతుకు - ఎంత
మొత్తుకుంటె దొరకదురా మెతుకు' - అంటూ ఆట, పాట, మాటల మేలుకలయిక 'గద్దర్' వేసిన పొలికేక దళిత సాహిత్యంలో నూతన శకాన్ని ప్రారంభించింది.

'బంగారు పంటలిచ్చె - భరతగడ్డ మనది
గంగమ్మ ప్రవహించే - పుణ్యభూమిరా మనది
గంగ యమునా బ్రహ్మపుత్ర - కృష్ణా, పెన్న, కావేరి
ఎన్నెన్నో జీవనదులు - ప్రవహించే జీవగడ్డ
మాల మాదిగన్నలకే - మంచినీళ్ళు కరువాయె
యాలరో ఈ మాదిగ బతుకు
మొత్తుకుంటె దొరకదురా మెతుకు'

అనే గీతంలో సకల సంపదలను సృష్టించే శ్రమజీవులైన దళితులకు ఆ సంపదపై ఎలాంటి అధికారంలేని వర్గ సమాజ స్థితిగతులను యథాతథంగా ఎత్తి చూపారు గద్దర్.

1977 లో దళితులపై జరుగుతున్న దౌర్జన్యాలను ఖండిస్తూ సెప్టెంబర్ ఒకటిన 'ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం' పక్షాన 'హరిజన, గిరిజన బలహీన వర్గాలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా రాష్ట్ర మహాసభ' జరిగింది. ఆ సందర్భంలో 'అభ్యుదయ రచయితల సంఘం' (అరసం) సభ్యులు వ్రాసిన గీతాల సంకలనం 'ఉప్పెన' అనే శీర్షికతో అచ్చయి వెలువడింది. ఈ సంక లనంలోని అనేక గీతాలు ఈనాటికీ దళితుల నాలుకలపై నాట్యం చేస్తూ, వారిలో నూతన ఉద్యమ చైతన్యాన్ని ప్రసరింపజేస్తున్నాయి.

'ఆగిన మీ గుండెలలో అగ్నిజ్వాలలున్నవిలే
మూసిన మీ కన్నులలో మూగ బాధలున్నవిలే
ఆకలి మంటలతో అలమటించే బిడ్డలూ
మానం కప్పుకునే మార్గం తెలియని తల్లులూ
కన్నీరు కార్చితే కరిగి రగిలి కనిలిపోయి,
॥ఆగిన మీ గుండెలలో॥'

అనే గీతంలో శ్రీ వై. విజయకుమార్ దళితుల గుండెల్లో దాగిన దావాన లాన్ని రగిలించారు.

'మమ్మడిగె వారెవరురా? - ఓరన్నా!
మాదేటి బతుకాయెరా - ఓరన్నా!
మాదేటి బతుకాయెరా....
మాలంట - మాదిగంట
ముట్టారానోల్లమంట
అరిజనుడా - గిరిజనుడా
అంటారానోల్లమంట
ఎద్దోలె పని జేసిన
ఎగిసెగిసి తంతన్నరు
జెండాలు మారితేమిరా? - ఓరన్నా!
గుండెల్లు మారాలెరా! - ఓరన్నా!
గుండెల్లు మారాలెరా!'

అనే గీతంలో ఊరి బయట పూరిగుడిసెల్లోనే ఉంటూ, కష్టపడి పని చేస్తున్నప్పటికి కష్టాలు తీరని దళితుల కోసం ఎన్ని చట్టాలు వచ్చినా; ప్రజల చిత్తాలు మారకపోతే ప్రయోజనం లేదంటూ 'ఎస్వి' దళితుల బతుకు పాటను ఆలపించారు.

'కులం కుళ్ళం అనీ
కుత్సితాలు పెంచుకోకోయ్
కూటికి లేనివాడా!'

అనే సందేశాత్మక ప్రబోధాన్ని విజయలక్ష్మి వినిపించారు.

'కాసగాలులు వినిరేసిన
నుసి బతుకులు మావీ
కసిగా సంఘం కరిచిన
మసి బతుకులు మావీ
చరిత్రలో అంటరాని - మానిసులం మేమూ
ధరిత్రిలో ధనస్వామ్యపు - బానిసలం మేమూ'

అంటూ దళితుల స్థితిగతులను వర్ణిస్తూనే తుది సమరంకోసం శ్రీ ఏటుకూరి ప్రసాద్ దళితులకు పిలుపు నిచ్చారు.

'ఎలి ఏసిన మేమంతా కలిశాముర
బలి పశువులు మేమింకా కాలేమురా' - అంటూ శ్రీ లలితానంద్ హెచ్చరించారు.

'ఈ హింసలు ఇక సహించము
ఈ బాధలు ఇక భరించము
ఇది దళిత వర్గ హృదిని
ప్రజ్వరిల్లు ప్రతిన'

అంటూ శ్రీ మల్లిక్ దళితుల హృదయాలలో ప్రజ్వరిల్లుతున్న ప్రతిజ్ఞను తమ గీతంలో ప్రతిబింబించారు.

'అంటరాని వాళ్ళన్నది
ముట్టరాని వాళ్ళన్నది
ఈ మచ్చ యెక్కడిదీ
యెవ్వడురా పెట్టినదీ?'

అంటూ శ్రీ కాంచనపల్లి చినవెంకరామారావు 'కులవ్యవస్థ'ను నిలదీసి ప్రశ్నించారు.

శ్రీ జి. వై. గిరి - 'పీడితజ్వాల', 'జి. వై. గిరి పాటలు', 'అక్షరం', 'బంధనాల్లో బ్రతుకులు', 'సంగం', 'బుర్రకథ', 'మంత్రాల పేరుతో చిత్రహింసలు' మొదలైన రచనల్లో దళితజన పక్షపాతాన్ని ప్రదర్శించారు.

దాదాపు పదహారు సంవత్సరాల క్రితమే దళితుల సమస్యలపై అభ్యుదయ రచయితల ప్రతిస్పందన అది.

అలాగే ఉ. సాంబశివరావు, క్రాంతికిరణ్, సతీష్‌చందర్, వెంకన్న, జి. అంజయ్యవంటి యువకవులు వర్గపోరాటంలో భాగంగానే 'దళిత పోరాటాన్ని' ముందుకు తీసుకుపోవాలని తమ కవితల్లో ప్రబోధిస్తున్నారు.

'మన్నెం పితూరిలోన మరణించిన రామరాజు
తెలంగాణ పోరులోన - తొలి అమరుడు కొమరన్న
శ్రీకాకుళం పోరులోన - కోరన్నా - మంగన్నా
కొండా మొదలు పోరులోన - రాజుల్దొర, లచ్చుందొర
చంపేస్తే భూమి పోరు - చావదని చాటినారు
మళ్ళీ మన గుండెల్లో - పోరుమొక్క నాటినారు'

-అంటున్న సాంబశివరావు మొక్కవోని భూమిపోరులోఅమరులైన రాజుల్దొర, లచ్చుం దొరలకు నివాళులర్పించారు. అలా ఈ కవి ఇటీవల వెలువరించిన 'పాత పాట సాక్షిగా - కొత్తపాట పాడతా' దళిత - జనం పాటలు సాహిత్యానికి లక్ష్యప్రాయంగా ఉన్నాయి.

ఇక దళిత కవుల్లో కనబడుతున్న మరోరకం కవులు - మార్క్సిస్టు సిద్ధాంతాలు నిర్దేశిస్తున్న ఆర్థిక పోరాటాన్ని డా॥ అంబేద్కర్ సిద్ధాంతాల సాంఘిక పోరాటాన్ని మిళితం చేసి 'సామాజికార్థిక పోరాటాన్ని' దళితులు కొనసాగించాలని సూచిస్తున్నారు. కత్తి పద్మారావు, మాష్టార్జీ యీ కోవకు చెందుతారు.

కత్తి పద్మారావు వ్రాసిన 'జనగీతం', 'దేశం డైరీ' వంటి కవితా సంపుటాలు దళిత ఉద్యమాన్ని వర్గపోరాటస్పృహతో నడిపే దిశను సూచిస్తున్నాయి.

దళిత గీతాల రచనలో బలమైన గొంతు వినిపిస్తున్న యువకవి 'మాష్టార్జీ'. తన కలాన్ని' గళాన్నీ దళిత ఉద్యమానికి అంకితం చేసిన యీ దళిత కవి గీతాలు అప్పుడే మరాఠీ, కన్నడ భాషల్లోకి అనువదింపబడ్డాయి.

'దోపిడీ కాబడేవారే దళితులు' అంటున్న మాష్టార్జీ వ్రాసిన ముప్పై గీతాలను 'దళిత గీతాలు'గా సాహిత్య మిత్రమండలి, హైదరాబాదువారు ప్రచురించారు. వీటిలో 'అందుకో దండాలు బాబా అంబేద్కరా!' గీతం విశేష ప్రాచుర్యాన్ని పొందింది.

'అందుకో దండాలు - బాబా అంబేద్కరా!
అంబరాన ఉన్నట్టి - సుక్కలు గురువంగో
ముందుగా నినుదలచి - పాటలు పాడేము
సీకటి మా బతుకుల్లో - సూర్యుడు పొడవంగో'

ఈ పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో డా॥ అంబేద్కర్ గుణగణాలను' ఆదర్శాలను చక్కని ప్రజల బాణీలో మాష్టార్జీ వర్ణించారు.

'మాది కాదు మాది కాదు - ఈ వ్యవస్థ మాది కాదు
దొంగలది దళారులది - దోపిడీ దుర్మార్గులది
దళితుల రక్తం తాగే - దగాకోరు రాయులది'

అనే 'దళితస్పృహ'తో మాష్టార్జీ రాస్తున్న గీతాలు దళిత ఉద్యమానికి కొత్త రక్తాన్ని ఎక్కిస్తున్నాయి. భవిష్యత్తుపై ప్రగాఢ విశ్వాసాన్ని, సమకాలీన సామాజిక వ్యవస్థపై అంతులేని ఆగ్రహాన్ని ప్రతిధ్వనిస్తున్నాయి.

జాతీయోద్యమ కాలంలో అస్పృశ్యతను నిరసించిన 'దళిత కవిత' వామపక్ష ఉద్యమాలలో పీడిత వర్గపోరాటంలో భాగంగా దళిత పోరాటాన్ని ప్రబోధించింది. ఇప్పుడు దళిత ఉద్యమం దళితుల ప్రతిఘటనకు పిలుపు నిస్తున్నది.

ఇవ్వాళ దళితులు విద్యావంతులౌతున్నారు. ఆలోచిస్తున్నారు. సాటిదళిత సోదరులను చైతన్య పరచడానికి సాహిత్యాన్ని ఒక బలమైన సాధనంగా ఉపయోగిస్తున్నారు. పాఠకుల నుద్దేశించి రాస్తున్న దళిత సాహిత్యంకన్నా, శ్రోతల నుద్దేశించి రాస్తున్న దళిత గీతాల్లోనే దళితుల ఆవేదన, ఆందోళన, ఆక్రందన, ఆవేశం ప్రబలంగా వినబడుతున్నది.

బొజ్జా తారకం, కత్తి పద్మారావు, ఎండ్లూరి సుధాకర్, గుంటూరు ఏసు పాదం వంటి దళిత కవులు వచన కవిత ద్వారా దళిత చైతన్యాన్ని జాగృత పరుస్తుంటే; మాష్టార్జీ, గద్దర్, శివసాగర్, జి. అంజయ్య, ఉ. సాంబశివరావు, ఒడ్డయ్య, క్రాంతికిరణ్, నీలం కవి, పాడేటి జాన్సన్, వెంకన్న, సాహూ, జి. వై. గిరి, కొలకలూరి స్వరూపరాణి మొదలైన దళిత కవులు పోరాట గీతాల ద్వారా 'దళిత కవిత'ను వేడెక్కిస్తున్నారు. దళితుల భాషను, బాణీలను, భావాలనూ తమ గీతాలకు ప్రాణవాయువులుగా వినియోగించుకుంటున్నారు.

దళితుల గుర్తింపు కోసం, ఆత్మగౌరవం కోసం, వ్యక్తిత్వ వికాసం కోసం, ఉద్యమ స్ఫూర్తి కోసం నేడు 'దళిత కవిత' రెక్కలు విప్పుకుంటున్నది. జూలు విదిలిస్తున్నది. గర్జిస్తున్నది. 'సాంఘిక వాస్తవికత' అయిన 'కులవ్యవస్థ'పై పోరాట మార్గాన్ని నిర్దేశిస్తున్నది. 'కుల నిర్మూలన' పూర్తి కానిదే 'సామాజిక న్యాయం' సమకూరదన్న స్పష్టమైన, నిర్దిష్టమైన భావజాల పునాదిని ఏర్పరచుకుంటున్నది.

దళిత కవులు - బుద్ధుడు, జ్యోతి బాపూలే, అంబేద్కర్, మార్క్స్, మావో, లోహియా ఆలోచనల సమన్వయ విచార ధారను తమ తాత్త్విక పునాదిగా గ్రహిస్తున్నారు. మరీ ముఖ్యంగా గమనిస్తే మార్క్సిజం - అంబేద్కరిజంల సమన్వయాన్ని సాధించే ప్రయత్నం చేస్తున్నారు.

1972 నాటి దళిత పాంథర్ల ప్రణాళిక దళిత కవులకు ఒక నూతన ఉత్తేజాన్ని కలిగించవచ్చు.

'దళితుల విముక్తి పోరాటం ఒక సమగ్రమైన విప్లవం కోరుకుంటున్నది. పాక్షికంగా అది అసాధ్యం. అది మాకొద్దు. మాకు సమగ్రమైన విప్లవాత్మకమైన మార్పు కావాలి. మొదట మాకు జరుగుతున్న సాంఘిక అన్యాయాలను ఎదిరించడంతో తృప్తిపడినా; తర్వాత ఆర్థిక, రాజకీయ రంగాలలో అధికారాన్ని మేమే చేపట్టాలి. మేము ఇక ఏమాత్రం లొంగి ఉండం. దేశాన్నంతా మేమే పరిపాలించాలి. మాకు వ్యక్తులపై ద్వేషం లేదు. మా కసి అంతా ఈ వ్యవస్థపైనే. హృదయ పరివర్తన, ఉదారమైన విద్యా విధానాలు - అన్యాయాన్ని గానీ, దోపిడిని గానీ రూపుమాపలేవు. దళిత ప్రజానీకంలో చైతన్యం కలిగించి, వాళ్ళను

కూడగడతాం. విప్లవజ్వాల ఈ విస్తృతమైన పోరాటాల నుంచే రాజుకుంటుంది. ఎన్నికల ద్వారా, సత్యాగ్రహాల ద్వారా, రాయితీల ద్వారా సాంఘిక వ్యవస్థ విప్లవీకరింపబడదు. మా సాంఘిక విప్లవ ఆలోచన ఈ నేలలో మొలకెత్తి, ప్రజల మనస్సుల్లో పెరిగి, చివరికి తపనతో జ్వలిస్తున్న ఉక్కులా, మెరుపులా ఆచరణలోకి వస్తుంది' - అంటున్న ప్రణాళిక దళితుల సాంఘిక విప్లవాలోచన ఒక సమగ్రమైన విప్లవాన్ని సాధించాలంటున్నది.

అలాగే ఆంధ్రప్రదేశ్‌లో 'దళిత మహాసభ', కర్ణాటకలో 'దళిత సంఘర్ష సమితి', మహారాష్ట్రలో 'దళిత పాంథర్స్', తమిళనాడులో 'దళిత కల్చరల్ ఫ్రంట్' మొదలైన సంస్థలు ఒకవైపు; 'వన్నియార్స్,' 'రిపబ్లికన్ పార్టీ', 'బహుజనసమాజ్ పార్టీ' మొదలైన రాజకీయ పక్షాలు మరోవైపు దళిత కవితకు నూతన ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తున్నాయి.

'మనం మన శత్రువును ప్రేరేపించాలి. కుల వైరుధ్యాలను పెంచాలి. సంక్షోభాన్ని సృష్టించే కారణాలను అన్వేషించాలి' అనే ఎత్తుగడతో దళిత కవిత పురోగమిస్తున్నది.' ప్రపంచమంతా శ్రమ విభజనను మాత్రమే చూసింది, కానీ భారతదేశంలో మాత్రం శ్రామికుల విభజన జరిగింది. శారీరక శ్రమపై ఆధార పడినవారు శూద్రులుగా, పంచములుగా, దళితులుగా పరిగణింపబడ్డారు' అని విశ్లేషించి చూపిన డా॥ బి.ఆర్. అంబేద్కర్ సిద్ధాంతాలను; 'పీడితులు ఆర్థిక, సామాజిక, రాజకీయ దోపిడికి వ్యతిరేకంగా వర్గ పోరాటాన్ని కొనసాగించాలి' అనే విప్లవ పథాన్ని నిర్దేశించిన మార్క్స్, లెనిన్‌ల కార్యాచరణను సమన్వ యించే దృక్పథాన్ని నేటి 'దళిత కవిత' ప్రధానంగా ప్రదర్శిస్తున్నది.

'నేను అస్పృశ్యుణ్ణి
నా ఒళ్ళంతా మట్టివాసన
నా బ్రతుకునిండా వెట్టివేదన
నా కళ్ళనిండా ఎండవేడిమి
ఎండకు ఎండి వానకు తడిసి
బిగుసుకుపోయిన
మర్రిఊడల్లా నా తల'
'నాకై కవిత లేదు

నాకు చరిత లేదు
నాలుగు వేదాలలోంచి
నాలుగు పాదాలలోంచి
నన్ను తొలగించారు
కట్టలోంచి జారిన కట్టెలా
ఒక్కణ్ణే ఎక్కడో ఎండిపోయాను'

అంటూ 'నది పుట్టిన గొంతుక'లో దళిత ఉద్యమకారుడు శ్రీ బొజ్జా తారకం దళితుల స్థితిగతులను వర్ణించారు. కావ్యాంతంలో—

'నేను ధూళిని గాలిని
మట్టిని మేరువును
ఉరుమును మెరుపును
అగాధాన్ని సముద్రాన్ని
ప్రవాహాన్ని ప్రళయాన్ని
అనలాన్ని ప్రభావాన్ని
అంబువును స్వయంభువును
నేను వస్తున్నాను'

అంటూ దళితుల విప్లవ విశ్వరూపాన్ని ఆవిష్కరించారు.

దళిత ఉద్యమంలో ఒక బలమైన కావ్యకర్తగానూ, కార్యకర్తగానూ కొనసాగుతున్న కత్తి పద్మారావు 'దేశం డైరీ' కవితా సంపుటిలోని 'స్వాగతం', 'ప్రతిభ', 'తెలుగువారి హోచిమిన్ శివసాగర్', 'ఎర్ర నక్షత్రం', 'సంకరాచారి' మొదలైన కవితలు దళిత చైతన్య ప్రతీకలుగా వెలుగుతున్నాయి.

'పదిరికుప్పం, కారంచేడు
తాడిపర్తి, కొత్తకోట
నీరుకొండ, దొంతలి
శివలూరు, బండ్లపల్లి
దేశవ్యాప్తంగా రక్తతర్పణం
చేసిన దళితుల పీడనల

విముక్తి పోరాటాలకు
స్వాగతం - సుస్వాగతం'

అంటూ విప్లవాహ్వానం పలుకుతున్నాడు కత్తి పద్మారావు.

విప్లవోద్యమంలో భాగంగా దళితుల దయనీయమైన జీవితాలను చిత్రిస్తూ, దళితుల్లో విప్లవ చైతన్యాన్ని రగిలించడానికి ప్రయత్నిస్తున్నవారు శివసాగర్, గద్దర్, జి. అంజయ్యలు.

'ఊరు మనదిరా - ఈ వాడ మనదిరా' అనే ప్రఖ్యాత గీతంలో-

'బండి మనదిరో - బండెడ్లు మనయిరా
ఈ కంచెకాడ మనం - ఆ మంచెకాడ మనం
ఈ పాడికాడ మనం - ఆ పసులకాడ మనం
ఈ మట్టికాడ మనం - ఆ ఎట్టికాడ మనం
ఈ నాటుకాడ మనం - ఆ మోటకాడ మనం
సాకిరేవుకాడ మనం - సారెలు దింపేది మనం
సావుకాడ మనమే - సొన్నాయికాడ మనమే'

అంటూ జి. అంజయ్య గ్రామీణ జీవితంలో అవినాభావంగా ముడివడి ఉన్న దళిత జీవితాన్ని ప్రతిభావంతంగా చిత్రించారు.

'బాంచెన్ బాంచెన్ అంటూ
గులాపోన్ని దొర అంటూ
ఎన్నాళ్ళు బతుకుతారురా - మాలన్నా
ఎదురు తిరగవేమిరా - మాదిగన్నా ॥బాంచెన్॥
నువ్ మతం మార్చుకున్నా
నీ బతుకు మారదన్నా
నువ్ కులం మార్చుకున్నా
నీకు కూడు దొరకదన్నా
నీవు రాజ్యమేలకుంద
నీ రాత మారదన్న
రాజ్యాధికారానికి - మాలన్న
నీవు రైఫోలందుకోరో మాదిగన్న'

అంటూ సాయుధ పోరాటం ద్వారా దళితులు రాజ్యాధికారాన్ని సాధించాలని గద్దర్ తమ గీతాల ద్వారా ఉద్యమ గర్జన వినిపిస్తున్నారు.

తెలుగులో దళిత గీతాలకు ఒక ఊపును కలిగించిన దళిత యువకవి 'మాష్టార్జీ' వచన కవితా ప్రక్రియలోనూ తన ప్రతిభకు ప్రకర్శిస్తున్నారు.

'ఒకనాడు అమీబానైతే
అయివుండవొచ్చునేమో కానీ
నేడు స్థిరమైన అస్తిత్వం కలిగిన
అడవి సింహాన్ని నేను—
ఒకనాడు జడివానకు
ఒడితిరిగి పడిపోయే
తుంగతోపునేమో కానీ
నేడు ఉత్తుంగ జలతరంగాలను
ప్రచండ వాయువేగాలను
తట్టుకుని
సగర్వంగా నిలిచే గడ్డిపరకను నేను'

అంటున్న మాష్టార్జీ ఇటీవలి కవితల్లో 'మూలవాసీ సిద్ధాంతం' (The Theory of Originism) ప్రభావం ఎక్కువగా కనబడుతున్నది.

ఆస్ట్రేలియాలో ఎబోరిజన్స్, ఆఫ్రికాలో నల్లజాతివారు (నీగ్రోస్), అమెరికాలో రెడ్ ఇండియన్స్ వలె దక్షిణ భారతంలోని అనార్యులైన ద్రవిడులు ఈ నేలతల్లి బిడ్డలు, మూలవాసులు. ఈ మూలవాసులకు రాజ్యాధికారం కావాలనేది మూలవాసీ సిద్ధాంతసారం.

'ఈ దేశ వాసులం - ఈ భూమి పుత్రులం
మేం మూల వాసులం - ఆది అసలు జాతులం
భారతాది జనులబట్టి బానిసలు మీరంటూ
వీళ్ళ దోపిడేందిరో - వీళ్ళ దగా ఏందిరో
వీళ్ళ సిళ్ళదేందిరో - వీళ్ళ నిక్కుడేందిరో'

అంటూ మాష్టార్జీ ప్రశ్నించడంతో బాటు తళితుల ఆత్మగౌరవం కోసం నిరంతరం పోరాడాలని తమ కవితల ద్వారా తమ జాతి జనులను ఉత్తేజపరుస్తున్నారు.

దళితుల్లో ప్రతిఘటన పోరాట చైతన్యాన్ని ప్రదీపింప జేయడానికి దాదాపు రెండు సంవత్సరాలుగా 'ఎదురీత' అనే రాజకీయ మాస పత్రికకు సంపాదక బాధ్యతను వహించి, వెలువరిస్తున్న ఉ. సాంబశివరావు రాసిన 'దళిత యువత', 'దళిత మాత', 'కార్చిచ్చు' మొదలైన గీతాలు 'దళిత కవిత' పయనిస్తున్న దిశను సూచిస్తున్నాయి.

'అంటరాని పల్లెల్లో
మంట రాజుకుందిరో
నివురుగప్పినా నిప్పు గుప్పు నంటుకొందిరో, మా
ఆత్మ గౌరవాన్ని మీరు గౌరవించుకుంటే, ఈ
అంటరాని మంటే మీ ఎంట దగులుతుందిరో'

అని హెచ్చరిస్తున్న ఉ. సాంబశివరావు—

'రక్తమైన చిందిస్తాం ప్రాణమైన అర్పిస్తాం
ఆత్మగౌరవాన్ని మేము హక్కుగానే సాధిస్తాం'

అనే దృఢ దీక్షను తమ కవితల్లో ప్రకటిస్తున్నారు.

ఇంకా క్రాంతి కిరణ్, చెరుకు సుధాకర్, ఎ. గవరాజు, ప్రసాద్, మిత్ర, కృష్ణ, వసంత్, సతీష్ చందర్, మరియమ్మ తదితర దళిత రచయితల కవితలు, గేయాలు 'దళిత కవిత'ను సుసంపన్నం చేస్తున్నాయి. 'నలుపు', 'ఎదురీత', 'దళిత్ వాయిస్' మొదలైన పత్రికలు ఈ కవితా వికాసానికి కృషి చేస్తున్నాయి.

'నా దేశంలో
నా ప్రజలు ఎంతకాలం
మనుష్యులుగా గుర్తింపబడరో
అంతకాలం
ఈ తిరుగుబాటు గీతం
పాడుతూనే ఉంటాను
నా జాతి
నా వారసత్వాన్ని కొనసాగిస్తుంది'

అని ప్రకటిస్తున్న దళిత కవులు—

'మేం జాంచోల్లం
మాదిగోల్లం....మాలోల్లం
గులాపోల్లం....గాయిదోల్లం
ఎట్టోల్లం....ఏమీ లేనోల్లం
దరిద్రులలో దరిద్రులం'
అనే 'దళిత వాస్తవికత'ను అక్షరబద్ధం చేస్తున్నారు.

రిజర్వేషన్ ఆందోళనల సందర్భంగా చెరుకు సుధాకర్ రాసిన 'అనగా.... అనగా....మెరిట్' (దీర్ఘ కవిత); విరసం జంట నగరాల శాఖ ప్రచురించిన 'మానవ స్మృతి' (1990); అరసం ప్రచురించిన 'కవితాభ్యుదయం' (1991) సంకలనంలోని 'కార్చిచ్చుపై కన్నీటి గీతం'; ఇటీవల వెలువడిన 'కవితా ఓ కవితా' సంకలనంలోని అనేక కవితల్లో 'దళితస్పృహ' విభిన్న కోణాల్లో వ్యక్తీకరింపబడింది.

ఎండ్లూరి సుధాకర్ రాసిన 'వర్తమానం' కవితా సంపుటిలోని 'పాద ముద్రలు' కవితలో....

'నేను బద్దలవుతున్న అగ్నిపర్వతాన్ని
నన్నెవరూ ఆపలేరు
నావి అగ్నిపాదాలు
నా కాళ్ళను ఏ తాళ్ళూ కట్టి పడెయ్యలేవు
నా శిరస్సు సగర్వ పతాక
నన్నెవరూ అవనతం చేయలేరు' అంటూనే—
'మట్టి నా ప్రతిభ
మట్టిలోంచి పుట్టిన మెరుపుసారం నా ప్రతిభ
మట్టి ఖుమిడికం దాల్చిన మనిషి నా ప్రతిభ'

అనడంలో దళితుల ఆత్మవిశ్వాసాన్ని, ఆగ్రహ చైతన్యాన్ని దళితకవులు తమ కవితల్లో ప్రకటిస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్ దళిత కళా మండలి, హైదరాబాద్ వారు వెలువరించిన 'దళిత కళామండలి పాటలు' (జూలై, 1992), దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక-కరీంనగర్ జిల్లా శాఖవారు ప్రచురించిన 'కరీంనగర్ జిల్లా

దళిత పాటలు' (1993) విస్తృతమౌతున్న దళిత చైతన్యానికి ప్రతీకలుగా ఉన్నాయి.

'ఇప్పటివరకు సాహిత్యంలో పై తరగతి దృక్పథమో లేదా మధ్యతరగతి దృక్పథమో భావజాల పరంగా పునాది అయ్యిందే తప్ప, ఏ అట్టడుగు ప్రజల గురించి మనం మాట్లాడుతున్నామో, ఆ అట్టడుగు ప్రజల దృక్పథం భావజాల పునాది కాలేకపోయింది. అందుకే నేడు చరిత్రను పునర్నిర్మించాల్సిన అవసరం ఉంది. చరిత్ర మధనం ఏదైనా కానీ, తిరిగి చరిత్రను నిర్మించాలనే తపనతో నిష్పక్షపాతంగా చర్చ జరిగి సాహిత్యంలో నూతన గవాక్షాల్ని ఆవిష్కరించాల్సిన సమయం ఆసన్నమయింది. పాక్షిక సత్యాలే, పాక్షిక అవగాహనే నేటి దాకా సత్యమనే భ్రమను కల్పించాయి. అర్ధ సత్యాలే సాహిత్యాన్ని ప్రభావితం చేస్తూ వచ్చాయి. చరిత్రలో విస్మరింపబడిన విషయాలను వెలికి తీయాలి. దళిత దృక్పథంతో చరిత్రను శోధించాలి. నూతన సత్యాలను ఆవిష్కరించాలి. సాంస్కృతికపరంగా ఆధిక్యతలో ఉన్న వర్ణాలు, వర్గాలు సాహిత్యంలో ఏ విషయంపై చర్చ జరిగినా తాము రాసిందే సరైనదని వాదన చేస్తాయి. వారు విస్మరించిన అంశాలు ప్రాథమిక అంశాలై ముందుకి వస్తున్నప్పుడు, సాహిత్యార్హత కలిగిన అంశాలై తోసుకు వస్తున్నప్పుడు ఈ పై వర్గాలే అవరోధాల్ని కలిగించి ప్రతిపక్షవాదాన్ని తొక్కిపెడుతున్నాయి' అని విశ్వసిస్తున్న దళిత రచయితలు నేడు కొత్త ప్రశ్నలకు కొత్త సమాధానాలు వెదుకుతున్నారు. పాత పాటల సాక్షిగా కొత్త పాటలు పాడుతున్నారు.

దళిత జీవితం, దళిత మానవత, దళిత సంప్రదాయం,దళిత సంస్కృతి, దళిత వాస్తవికతలనుండి 'దళిత తాత్వికత'ను రూపొందించే అన్వేషణ దళిత రచయితలు కొనసాగిస్తున్నారు. సాంఘిక అసమానతలను నిర్మూలించే ఒక సమగ్రమైన దార్శనికత కోసం తపిస్తున్నారు, అధ్యయనం చేస్తున్నారు.

సమకాలీన దళిత రచయితలందరూ దళితుల సాంఘిక, ఆర్థిక, రాజకీయ పీడనను ప్రతిఘటిస్తున్నారు. దోపిడి సమస్త రూపాలను వ్యతిరేకిస్తున్నారు. పీడితుల రాజ్య నిర్మాణం కోసం పిలుపు నిస్తున్నారు. సామాజికదుర్గమతలపై తీవ్రమైన స్వరంతో తమ ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నారు. ఇది నేటి 'దళిత కవిత' నడుస్తున్న గమనం, దాని గమ్యం.

అలాగే దేశవ్యాపితంగా దళిత సాహిత్యాన్ని రాసిన, రాస్తున్న, సుసంపన్నం చేస్తున్న రచయితల్లో ప్రముఖంగా పేర్కొనదగినవారు:- శ్రీయుతులు శంకర్రావు ఖరాత్, నామ్‌దేవ్ డసాల్, రాజా ఢాలే, దయాపవార్, నారాయణ్ సుర్వే, శరణ్‌కుమార్ లింబాతే, అరుణ్ కాంబ్లే, లక్ష్మణ మానే, చంద్రమోహన్ వ్యాగ్, శ్రీమతి పద్మా పవార్ (మహారాష్ట్ర), జతిన్ బాగ్చి, బి.కె. బిశ్వాస్, సురేందర్ శిక్దా (పశ్చిమ బెంగాల్); గోమాస్తోప్రసాద్ సోరంగ్ (పశ్చిమబెంగాల్) సంతాలీ రచయిత); చంద్రకాంత్ పోస్తే, శాంత్‌కుమార్ (కర్నాటక); కె. ఆర్. పటార్‌కర్ (భోపాల్); సీతారాం (రాజస్థాన్); కుమార్‌హసన్, తిరువళ్ళువార్, కె.కె. ఎస్టా (కేరళ); మోహన్ (మద్రాస్) మొదలైనవారు దళిత జన జాగృతి కోసం అంకితమై సాహిత్య సృజన చేస్తున్నారు.

అయితే దళిత సాహిత్యం ఈనాడు దానికదే ప్రత్యేకమైన స్రవంతివలె కాకుండా విస్తృత ప్రగతిశీల సాహిత్యోద్యమ స్రవంతిలో భాగంగానే ప్రవహించాల్సి ఉంది. దళిత సాహిత్యాన్ని సృష్టిస్తున్న రచయితలు పుట్టిన 'కులం' ప్రాతిపదికన కాకుండా, వారి ఓరియంటేషన్ ప్రాతిపదికన దీనిని అంచనా కట్టవలసి ఉంది. దళిత సాహిత్యం అన్యకుల విద్వేషాన్ని ప్రబోధించేదిగా కాకుండా, కుల నిర్మూలన దిశను సూచించేదిగా ఎదగాల్సి ఉంది. దళితుల ఆవేదనలు, ఆవేశం, పోరాటాలు, త్యాగాలు విస్తృత పీడితుల ప్రయోజనాలను పరిరక్షించడానికి ఉపయోగపడాలి. స్వాతంత్ర్యానంతర కాలంలో పరిమితంగానే అయినా ప్రభుత్వం కల్పించిన రాయితీలు, సబ్సిడీలు, రిజర్వేషన్లు, రిజర్వ్‌డ్ నియోజక వర్గాల మూలంగా నేటి భారతీయ సమాజంలో ఒక 'నూతన ధనికదళితవర్గం' ఆవిర్భవించి ఉంది. ఇదొక చారిత్రక యదార్థం. దళితుల పోరాటాల ఫలితాలను ఈ నూతన ధనికదళితవర్గం హస్తగతం చేసుకునేందుకు పొంచి చూస్తున్నది.

దళిత ఉద్యమానికి, దళిత సాహిత్యోద్యమానికి నిర్దిష్టమైన వర్గ దృక్పథం లేనట్లయితే, ధనిక దళిత వర్గం ప్రయోజనం పొందే ప్రమాదాన్ని దళిత రచయితలు గుర్తిస్తున్నారు. పీడిత దళిత వర్గాన్ని చైతన్యపరుస్తూ, సమరశీల పోరాటాల వైపు వారిని ప్రేరేపిస్తూ రచనలు చేస్తున్నారు. సామాజిక న్యాయం, సమసమాజ నిర్మాణం ఆశయాలుగా సాహిత్యాన్ని ఒక పదునైన ఆయుధంగా ప్రయోగిస్తున్నారు,

# ఇప్పుడంతా దళిత సూర్యోదయ కవిత

—శ్రీ కె. శ్రీనివాస్

['ఉదయం' దినపత్రిక (23-8-93) సారస్వతానుబంధం 'రసన'లో ప్రచురితమైన వ్యాసం ఇది. యువభారతి నిర్వహించిన చర్చ సమావేశంలో 'తెలుగు కవిత్వం - దళిత స్పృహ' అన్న అంశంపై ప్రసంగించినప్పుడు ఈ వ్యాసం నోట్సుపైనే ప్రధానంగా ఆధారపడ్డాను. కుసుమ ధర్మన్న కవి దగ్గర నుంచి నేటి ఆధునిక కవులదాకా అనేకమంది పేర్లుకూడా ఈ వ్యాసంలో ప్రస్తావితం కాలేదు. 'సతీష్‌చందర్' అన్న కవిపైనే ప్రధానంగా కేంద్రీకరించిన ఈ రచన - దళిత కవిత్వంలో ప్రస్ఫుట మవుతున్న చైతన్య రీతులను మాత్రమే పరిగణలోకి తీసుకున్నది. ఉదాహరించడంలో అనేకమంది కవులకు 'అన్యాయం' జరిగినా, దళిత కవిత్వతాత్త్వికతను వ్యక్తీకరించడంలో ఇది ప్రాతినిధ్య వ్యాసం అనే భావిస్తున్నాను.— కె. శ్రీనివాస్.]

ఒక జననం వాయిదా పడుతూ వస్తున్నది.

రుతువుల దోషం ఏమీ లేదు. కోయిలలు పాడుతూనే ఉన్నాయి. అయినా, శబ్దశాపం జరిగి జననం వాయిదా పడుతూనే ఉన్నది.

"వర్ణధర్మం అధర్మధర్మమే" అని గురజాడ అప్పారావు విశ్వాస ప్రకటన చేసినప్పుడు "అంటు దోషము మాకు లేదండి" అంటూ గరిమెళ్ళ సత్యనారాయణ వాగ్గేయ ప్రచారం చేసినప్పుడు ఆ కవికోకిలలు రుతుగీతినే పాడాయి.

పంచమ స్వరం సోకగానే 'కసరి బుసకొట్టే నాల్గు పడగల హైందవ నాగరాజు'ను గుర్రం జాషువా కనిపెట్టాడు. "స్వాతంత్ర్యంబను స్వర్ణ సౌధమున మా భాగంబు మాకిత్తురో ఖాతాలేదని వ్రాసిపుచ్చెదరా" అంటూ సహేతుకమైన భయాన్ని ప్రకటించాడు. 'సవర్ణుడు' కాదని అభ్యుదయం ఆ కవిని వెలిగా ఉంచింది.

జననం వాయిదా పడింది.

పంతొమ్మిది వందల నలభై యేడు మోసాన్ని కవిత్వీకరించిన దిగంబరులు తమ ఆగ్రహాన్ని కంచికచర్ల కోటేశు అమరత్వానికి అంకితమిచ్చారు. ఆయుధాల కోలాహలంలో ఆ ఒక్క శబ్దమూ అణగిపోయింది. మళ్ళీ జననం వాయిదా.

* * *

హైందవ పద్యానికి అతికిన అయిదవ పాదం ఇప్పుడు వృత్తాలను మింగే వృత్తాలను కలగంటున్నది. ఈసారి ఈ గర్భం నిలుస్తుంది. జననం ఖాయం.

* * *

విప్లవకారులు క్షమిస్తే నేటి కవిత్వాన్ని మరో పేరుతో పిలవాలనుంది. గురజాడ అప్పారావుతో ఆరంభమైన ప్రజాస్వామిక సాహిత్యం ఇప్పుడిప్పుడే తన జన్యువులన్నిటినీ వ్యక్తం చేస్తున్నది. ఇప్పుడు వస్తున్నది విప్లవ రచయితలు అనుకుంటున్న విప్లవ సాహిత్యం మాత్రమే కాదు- అంతకంటే విస్తృతమైనది, లోతైనది. ప్రగతిశీలతను కోరుకునేవారు మురిసిపోయేంత వైవిధ్యభరితమైనది. ఈ ఇంద్రధనుస్సులో 'విప్లవకవులు' రచయితల పాత్ర తక్కువేమీ కాదు.

నగ్నముని క్షమిస్తే- ఇప్పుడు వర్ధిల్లుతున్నది ప్రజాస్వామిక కవిత్వం.

* * *

అరవయ్యోదశకం చివర్లో తలెత్తిన తరం 'కోటేశుల్ని' ఎజెండా మీదికి తెచ్చింది. కారంచేడులో కోటేశుల ప్రతిఘటన ప్రారంభమైంది. ఈనాడు ఆంధ్ర

ప్రదేశ్‌లో దళిత ఉద్యమాల ఉనికికి కారంచేడు, చుండూరు సంఘటనలు, రిజ ర్వేషన్ ఆందోళనలు ప్రధాన నేపథ్యాలుగా ఉన్నాయి. సాంస్కృతికరంగంలో దళితచైతన్యం బలపడింది. విప్లవకారులు, రచయితలు, వాగ్గేయకారులు కూడా ఈ క్రమంలో పాలుపంచుకున్నారు. అనేక కారణాలవల్ల విప్లవవాదుల నుంచి వీడి అస్తైక్యం కావాలని కొందరు దళితవాదులు భావించడం రెండు శిబిరాల మధ్య తీవ్రమైన చర్చలు సాగుతుండడం ఇటీవలి పరిణామాలు.

సైద్ధాంతికంగా దళితవాదాన్ని ప్రచారం చేయడం, సాహిత్యచరిత్రలోని ప్రముఖులపై అంచనాలను ప్రశ్నించడం తప్పితే సృజనాత్మక కృషి ఆ శిబిరంలో జరుగుతున్నదా అని అనుమానం వస్తుంది. పాటలు కళారూపాల విషయంలో దళిత సాహిత్యంగా చెప్పదగ్గవి, గొప్పవిగా చెప్పదగ్గవి చాలానే ఉన్నాయి. వచన కవిత్వం, కథలు ఏ మేరకు వస్తున్నాయి?

* * *

''చంద్రమండలమ్మీద మానవుడు పాదం మోపినట్లు నేనిప్పుడు కొత్తగా వృత్తంలోపల అడుగులు నాటుతున్నాను'' (సతీష్‌చందర్ : వృత్తాంతం 1991 ఆంధ్రజ్యోతి వారపత్రిక - దీపావళి ప్రత్యేక సంచిక).

కులసమస్యమీద వచనకవు లెవరూ రాయలేదనికాదు. తెలుగుదేశం హయాంలో జరిగిన రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనపై వరవరరావు రాసిన 'దెజావూ' దళితులపక్షాన నిలిచిన ఉత్తమశ్రేణి కవిత. మండల్ ఆందోళన సందర్భంగా విప్లవ రచయితలు ప్రకటించిన కవితలన్నీ చెప్పుకోదగ్గవే. అయితే అవేవీ కేవలం 'దళిత ఐడెంటిటీ' కేంద్రంగా వెలువడినవి కావు.

జాషువా తరువాత దళితకవులే లేరా? ఈ వ్యాసం పరిధిలోకి రారుగానీ గేయకవులైతే అసంఖ్యాకంగా ఉన్నారు. నేటి యువక పాటగాళ్ళయితే అగ్ర గాములుగా ఉన్నారు. వచనకవులు కూడా ఉన్నారు, 'వేదవేదాంగ వైభవాలపై నాకుగల వారసత్వపు హక్కులు దొంగిలించబడినా'యని నమ్మిన బోయి భీమన్నా, జాషువా వొరవడిలోనే సాగిన జ్ఞానాందకవీ ఉన్నారు. వారిపై మెయిన్ స్ట్రీమ్ సాహిత్యకారుల అంచనాలు ఏమైనా రీవేల్యుయేషన్‌లో వారికి మంచి మార్కులే వస్తాయి.

బొజ్జా తారకం దీర్ఘకవిత 'నేను అస్పృశ్యుణ్ణి' (నది పుట్టిన గొంతుక) దళిత చైతన్య వచన కవిత్వానికి నాంది పలికింది. అయితే ఆయన కమ్యూనిస్టు కవిగానే ఆ కవిత రాశారు. స్వయంగా దళితుడు కావడంవల్ల కుల అణచివేతను బలంగా వ్యక్తం చేయగలిగారు. 'అంబువును స్వయంభువును నేను వస్తున్నాను' అని కవిత చివర్లో చెప్పుకున్న సంకల్పం అభ్యుదయ విప్లవ కవితా సంప్రదాయాలలోనిదే. ఆయన ఆ కవిత రాసిన సమయానికి (ఎమర్జెన్సీ), ఇప్పటికీ దళిత దృక్పథం పదునెక్కింది.

ఇక ఎండ్లూరి సుధాకర్‌కి దళితస్పృహ ఉంది కానీ, అది బహుముఖ వర్తమానంలో ఒకానొక ముఖం మాత్రమే.

తెలుగు వచన కవిత్వంలో తొలిసారి దళిత వాదాన్ని బలంగా ప్రకటించిన కవి సతీష్‌చందర్. సతీష్‌చందర్ మార్క్సిస్టు. ప్రజారచయితల సమాఖ్య నాయకులలో ఒకరు. దళిత కవిత్వం కంటే ముందు 'సాధారణ' కవిత రచనలు చాలా చేశాడు. గత రెండు సంవత్సరాలలో ఆయన ఆరు శక్తివంతమైన దళిత కవితలు రాశారు. ఈ ఆరింటిని కలిపిచూస్తే సతీష్‌చందర్ నిశ్శబ్దంగా నిర్మిస్తున్న సుస్వర పేటికను గమనించవచ్చు.

సతీష్‌చందర్ 'మాలపేట'లో నిలబడి మాట్లాడుతాడు. నాలుగు కులాలూ ఒక వ్యవస్థ. తాను దానికి వెలిగా వున్న మనిషి. "బ్రహ్మకున్న నాలుగు ముఖాల నుంచి నాలుగు కులాలు పుట్టాయంటారు. ఈ ఐదోవాడెక్కడినుంచి వచ్చాడు?" అని జాషువా ప్రశ్నిస్తాడు. ఈ నాలుగు, అయిదు అన్న అంకెలలో హైందవ సమాజం క్రూరత్వాన్ని సతీష్‌చందర్ అద్భుతంగా చెబుతాడు.

"నీకు చదివినా అర్థం కాదురా" అని
మీరు తిట్టుకుంటూ చెప్పిన వేళ్ళమీద లెక్క
నాకు చదివాకనే అర్థమయింది.
నే నెన్నిసార్లు లెక్క పెట్టుకున్నా
నా చేతికి నాలుగు వేళ్ళే ఉండేవి
.... .... .... .... .... .... ....

నిజం చెప్పండి
వంచముడంటే అయిదో వేలు లేనివాడనేనా అర్థం?
మా ముత్తాత ఏకలవ్యుడు చెప్పాడు'' (పంచమ వేదం : ఎదురీత 1991 మే సంచిక.)

"ఏడు రంగులే కాదు
చతుర్వర్ణాలు కలిపినా తెలుపే
కాకుంటే నల్లగా కాస్త అయిదోతనం" (లాస్ట్ ఏంజిల్స్ : సుప్రభాతం 1992 అక్టోబర్ సంచిక.)

"ఊరుకు నాలుగు మూలలు
జీవులకు నాలుగు కాళ్ళు
పొర్లడానికి నాలుగు వరసలు
కులం నాలుగు పాదాలా పాకేది
ఎక్కడో అయిదోమూల దూరంగా...."

.... (శిశువు నేడు లేచెను : ఎదురీత)

'హైందవ పద్యానికి అలికిన అయిదవ పాదాన్ని నేను
వృత్తం వెలుపలే
ఉత్తవచనంలా పరిభ్రమించిన నాకు—
మరణమెప్పుడూ పునరావృత్తమే' (వృత్తాంతం)

శూద్రవర్ణంతో సహా నాలుగు కులాలూ హైందవ వ్యవస్థలో భాగమేనని కవి భావిస్తున్నాడు. సతీష్ చందర్ ఎక్కడా కులఐక్య సంఘటన (అగ్రవర్ణ వ్యతిరేక సంఘటన) గురించి మాట్లాడలేదు. 'వృత్తాలను మింగే వృత్తాలను కలగంటున్నాను' అనడంలో కొత్త సమీకరణల ద్వారా వర్ణవ్యవస్థను ప్రతి ఘటిస్తామనే సూచన వుంది గానీ, ఆయన షెడ్యూల్డు కులాల పక్షాన మాత్రమే కవిత్వం చెబుతున్నాడు. వ్యూహాలకు, జనసమీకరణకు ప్రాధాన్యం ఇచ్చి రాస్తే కవిత్వం దెబ్బతింటుందని, పదును కోల్పోతుందని సతీష్ చందర్‌కు తెలుసు. అతను నిజంగా వూరిబయట నిలబడి కవిత్వం రాస్తున్నందువల్లే అతని అక్షరాలు

నలుపంత స్వచ్ఛంగా, చెమటంత పరిమళంగా ఉన్నాయి. తొలినాటి దళిత కవులు సంస్కృతీకరణ కోరి వ్యాస వాల్మీకులను, అరుంధతినీ ఆవాహన చేసుకునేవారు. నేటి దళిత కవులకు శంబూకుడు, ఏకలవ్యుడు కావాలి. బుద్ధుడూ, క్రీస్తూ కావాలి.

క్రీస్తు దళితయోధునికి ప్రతీకగా సతీష్ తరచు వాడతాడు.ఆంధ్రదేశంలో-ముఖ్యంగా కోస్తాలో దళితుల జీవితాల్లో క్రైస్తవం తెచ్చిన మార్పును ఇక్కడ నేపథ్యంగా గ్రహించాలి. లాస్ఏంజెల్స్‌లో నల్ల ఆగ్రహాన్ని ఆవాహన చేసు కుంటూ (బొజ్జా తారకం కూడ) దక్షిణాఫ్రికాతో దళిత సంఘీభావం ప్రకటించారు.

కవిత 'లాస్ ఏంజిల్స్' లోనయినా, చుండూరు మృతవీరుల కోసం రాసిన 'శిశువు నేడు లేచెను'లో నయినా జీసస్‌ను ఉషస్సుగా చూడడం, అతని అవతరణను యోధుని జననంగా భావించడం కనిపిస్తాయి. జీసస్ అమరత్వాన్ని, శిలువవేసిన క్రమాన్ని దళిత యోధునిపరంగా అద్భుతంగా వాడుకున్నాడు సతీష్.

చేతులు కడుక్కున్న చక్రవర్తుల్లారా
ముళ్ళకిరీటాలు పెట్టేముందు
చిటికెడు నల్ల రక్తాన్ని చూపించండి
.... ... .... .... .... .... ....
వీరుడి వీపుమీద మీరు
కొరడాలై ముద్దాడినప్పుడు
మంచి గంధపు చెట్లు మూర్ఛిల్లి వుంటాయి
రక్తపు వాసన చెప్పండి ... (లాస్ ఏంజిల్స్)

శిరస్సులో మెదడుండడం నేరం
మళ్ళీ మళ్ళీ రాజ్యాంగం రాయకుండా
ముళ్ళకిరీటం గుచ్చారు
ముఖ వర్చస్సుండడం నేరం

ఏ తల్లీ ముద్దాడకుండా
కాండ్రించి ఉమ్మారు
అన్నిటికన్నా, ఛాతీలోపల గుండెకాయ వుండడం నేరం
బానిసకొడుక్కి ప్రేమెందుకని
బరిసెలతో పొడిచారు
పంటపొలాల్లో శిశువుకు శిలువ మరణం (శిశువు నేడు లేచెను)

హిందూపురాణ గాథల్ని ప్రతిభావంతంగా అన్వయించాడు సతీష్. 'మీ క్లాసులోని పాండవుల్నీ, కౌరవుల్నీ అడిగినట్లు చెప్పండి కొత్తగా కేస్ట్ తెచ్చుకుని క్లాసులో చేరిన కర్ణుడికి నా సానుభూతిని తెలియజేయండి.... ముమ్మాటికి మేం తల్లికి పుట్టిన బిడ్డలమే....గొప్పోళ్ళు వెలివేసిన కుంతెమ్మవయినా మా యిళ్ళకొస్తే గొంతెమ్మను చేసి కొలుచుకుంటాం. ఏకలవ్యుడు దేవుళ్ళకు కాకుండా తల్లికే పుట్టాడు.... చివరగా ఒక్కమాట. నా అంతిమయాత్రలో పాల్గొన్న శకునిమామలకు ధన్యవాదాలు చెప్పండి....వాళ్ళ స్మారకోపన్యాలనిండా బాలెట్ పెట్టెల ముక్కవాసనే....' గురువుల కులపిచ్చికి బలయిన దళిత విద్యార్థుల స్మృతిలో రాసిన పంచమవేదంలోని చరణాలివి. 'అంగరాజ్యభిక్షలో అగ్రవర్ణులైన అపరశూద్రులారా రాజకీయపు రంగు చెప్పండి, దేవుడికాళ్ళలోంచి భుజాలవరకూ ఎగబాకిన ధమనులు మీరు' (లాస్ ఏంజిల్స్) అన్న చరణాలలో కూడా ఆధునిక అగ్రవర్ణాలుగా ఎదిగిన సాంప్రదాయ శూద్రకులాల వారికి కర్ణుడిని ప్రతీకగా తీసుకున్నాడు. పురాణాలలో, ఇతిహాసాలలో 'వెలి'కి గురయిన పాత్రలను ఆలంబన చేసుకోవడం కొత్త విషయం ఏమీకాదు. సాంప్రదాయ విలువలపై ధ్వజమెత్తిన కళాకారులందరూ పురాణపాత్రలపై కొత్త అంచనాలతో రచనలు చేశారు. దళితుల వేదనకు ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ భావనలను గుర్రం జాషువాయే సమకూర్చారు. జాషువాను మించి సతీష్‌చందర్ ఈ విషయంలో ముందుకు వెళ్ళింది తక్కువే. 'మంచియన్నది మాలయైతే మాలనే అవుదున్' అన్నంత ఆత్మ గౌరవ ప్రకటన జాషువాలో కూడా లేదు. జాషువా దైన్యాన్ని ఆలంబన చేసుకుని, దెప్పిపొడుపును నిష్ఠూరాన్ని పదునుకోసం వాడుకున్నాడు. అణగారిన సమాజ శ్రేణుల ప్రతినిధులు ఆత్మాభిమానాన్ని దృఢంగా ప్రకటించడం ఇప్పటికీ సాధ్యం కావడంలేదు. 'పుట్టుమచ్చ'లో ఖాదర్ మొహియుద్దీన్ కూడా దైన్యాన్ని మాత్రమే ప్రధానంగా ప్రకటించాడు. అయితే, సతీష్‌చందర్

బలహీనంగానైనా ఆశావహ దృష్టిని, ఆచరణాత్మక పరిష్కారాన్ని సూచించాడు. 'సజీవ దహనానికి బియ్యం కార్డు మీద కిరోసిన్ సరఫరా చేసి, పులిదారలు బయటపడేస్తూ బ్యాలెట్ ముక్క వాసనతో కన్నీటి ధారల స్మారకోపన్యాసాలు చేసిన శకునిమామలను రేపు అడవిలో ఏకలవ్యుడు ఉచితంగా దహనపరచి రుణం తీర్చుకుంటాడని' (పంచమవేదం) ఫలశ్రుతి చెబుతాడు.

....నాలుగు రోడ్ల కూడలిలో గర్భందాల్చిన నేలతల్లి
వీరుల సమాధులన్నీ నిండు చూలాళ్ళే
.......................
గర్భశోకతప్త హృదయలైన మాతృమూర్తులారా కన్ను తుడుచుకుని
ధవళ వస్త్రాలతో స్వాగతం పలకండి
'శిశువు నేడు లేచెను హల్లెలూయ' (శిశువు నేడు లేచెను)

'క్రీస్తు పునరుత్థానాన్ని ఉద్యమ ప్రతీకగా ఆశ్వాసించాడు వృత్తాలను మింగే వృత్తాలను కలగనడమే కాదు, కాక తీసిన దప్పుమీద శబ్దతరంగం వికసించినట్లు కత్తులకు సానపట్టే చక్రం మీద నిప్పు పువ్వుల్ని పూయించడాన్ని దర్శించాడు. (వృత్తాంతం). దళితులలోని రెండు శాఖల విభేదాలను ఒకరినొకరు చూసుకోలేని కనుపాపల సహజీవనమనీ ఉరిపడ్డ ఖైదీలు పెట్టుకున్న ఉచ్చసిదాల వివాదమనీ, నపుంసకుణ్ణి కట్టుకున్న తోబుట్టువుల సవతిపోరు అనీ గుర్తించిన సతీష్‌చందర్ అక్కడితోనే ఆగిపోతే జాషువా పద్యాలకి కొనసాగింపుగా మిగిలేవాడు. వాడక్కూడా వర్ణాశ్రమాన్ని బోధించింది మనువు తాత వారసత్వమేనని, చైతన్యవంతులైన తరువాత తామిద్దరి చుట్టూ ఒకే సూర్యోదయం ఉందని దళిత చైతన్యాన్ని, మిలిటెంట్ చైతన్యాన్ని ప్రకటించాడు. (కలవని కనుపాపలు, ఉదయం ఆదివారం అనుబంధం.)

సతీష్‌చందర్ దళిత కవిత్వంలో ఇటీవలిది అయిన 'ఒక జననం వాయిదా' (ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం 27 జూన్ 1993) విద్యావంతుడైన దళితుని న్యూనమనోభావాలకు నిలువుటద్దం పట్టింది. మానవ అనుభవాలలోని అస్పృశ్య భాగాలను అందించేటప్పుడు 'పోరాటస్ఫూర్తి' తప్పనిసరి కానక్కరలేదని, కేవలం వెల్లడి కూడా ప్రయోజనం సాధిస్తుందని ఆ కవిత నిరూపిస్తుంది.

'నా పూర్వీకుల భగ్న ప్రేమలకు బహుమానాలుగా సవర్ణ సువర్ణ సుందరీమణు లిచ్చిన విషపాత్రలు, నా తల్లి గుండెల్ని కప్పుకున్న వాయు వస్త్రాలు, ఆమె గాయాలతో మెల్లిగా మూలిగినట్లనిపించిన నాన్న నగ్న పాదాలు, ముడులు ముడుల ముత్తాత శిరోజాలు' - నేటి తెలుగు కవితకు కొత్త భావుకతను, చీమూ నెత్తురుల భావుకతను అందిస్తున్నాయి.

సతీష్ కవిత్వంలో లోపం ఒక్కటే. ప్రతి కవితలోనూ ప్రస్ఫుటంగా కనిపించే స్కీము. రెండు మూడు చరణాలు చదవగానే పద్యం నిర్మాణం అంతా ముందే స్ఫురించేంతగా వుంటుంది ఆయన స్కీము.

* * *

వర్తమాన భూతకాలంగాళ్ళు నీవంటి పాటల్ని వి...
పోసుకుంటారనే స్ఫురణే మాకు ఆనందంగా వుంది

నీ కవితా పాదాల కొసవేళ్ళను చుంబిస్తున్నాము సతీష్! గుర్రం జాషువా ఎడమకాలికి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గండపెండేరం తొడిగినదానికంటె, మా ముద్దు గొప్పదికదా, మా ధన్యత గొప్పదికదా, మన తరం గొప్పదికదా!

('ఉదయం' - దినపత్రిక సౌజన్యంతో)